కళాకేళి ప్రచురణలు : 15

# దయ్యం పట్టిన మనిషి

నవల



టాలుస్టాయి

టాలుస్టాయి

# దయ్యం పట్టిన మనిషి

రాంషా

టాలుస్టాయి వ్రాసిన 'ది డెవిల్' కి

సాధికార అనువాదం

సామల్ కోట

కళా కేళి ప్రచురణలు.

## ఈ పుస్తకాన్ని గురించి :

"నువ్వెప్పుడూ నాలోని మంచినే వ్రాస్తావు. అది బొత్తిగా మంచిపనికాదు. నాలోని చెడ్డని కూడా చెప్పాలి. నాచిన్న తనంలో చాలా దుర్మార్గంగా నడిచాను. నేటికీ బాధించేవి ముఖ్యంగా ఆ నాటి రెండు సంఘటన లున్నాయి. ఫరవాలేదు : ఇవి కూడా రాయి. అందులో ఒకటి: నాపెళ్ళి కాకముందు మా ఊరి పల్లెపడుచుతో సంబంధం—అదే దయ్యంపట్టిన మనిషిలోని కధ. ఇంకొకటి బాగా చిన్న తనంలో మా ఇంటి దాసీ కుర్రదాని కధ. అది మా పిన్నిగారింట్లో ఉండేది. కన్యకూడా. దాన్ని నేను చెరిచాను. అందువల్ల దాని నౌకరీ ఊడిపోవటం, దాని జీవితం నాశనం కావటం జరిగింది."

ఇవి టాలుస్టాయి తన ఆత్మకధ వ్రాస్తున్నవానితో, గుండెల్ని నమిలే పాత జ్ఞాపకాల ఆవేదనలలో అన్నమాటలు.

1857 లో టాలుస్టాయి ఒకసారి ఐరోపా పర్యటించి వచ్చాడు. ఆ వచ్చిన అనతికాలంలోనే 'అక్సిన్యా' అనే పల్లెపడుచుతో సంబంధం ఏర్పడింది. అదే అతని నరాల్ని గట్టిగా పట్టుకొంది. అతని జీవితంలో ఎక్కువ కాలానికి అదొక తీరని సమస్య అయిపోయింది. అదే ఈ 'దయ్యంపట్టిన మనిషి'కి జీవం.

అతని డైరీ అంటుంది: 'ఈ వాళ ట్రినిటీ పండుగ. అడివి ఛెర్రీ పువ్వులు అత్రులు చాస్తున్నాయి. వాసిలీ కంఠం ఆరుస్తోంది. అ—ని ఓరకంటితో చూశాను; చాలా అందంగా ఉంది. ఇంతకాలం వృథాగా గడిపివేశాను; దురదృష్టవంతుణ్ణి. ఈ వేళ అడివిలో. వెధవని; వర్ఠి పశువుని. కంచులాంటి ఆమె వంటి రంగు, ఆమె కళ్ళు....నా జీవితంలో ఇంత ఇదిగా ప్రేమించలేదేమో! ఇంకో ఆలోచనే లేదు. గుండెలు పీకుతున్నాయి. రేపు నాబలం కొద్దీ.'

ఒక నెల తరివాత : 'ఆమె విషయం ఇప్పటికే నా ముఖం మొత్తింది.'

ఒక సంవత్సరం తరవాత : 'అ—ని చాలా అసహ్యించుకుంటున్నాను. కాని ఆమె భుజాలు.'

ఆ తర్వాత ఇంకో ఆరు నెలలకి : 'ఇంకా అ—ని చూస్తూనే ఉన్నాను.'

ఇంకో అర్ధసంవత్సరం గడిచాక : 'నేను దాన్ని చూడటమే లేదు; కాని

ఆ మరునాడు : 'ఆమె ఎక్కడా కనబడలేదు—ఆమెకోసం వెదికాను. ఇది ఒక దుప్పి పడే బాధకాదు; ఒక భర్త తన భార్యకోసం పడే ఆవేదన. ఇది వరకటి సంతృప్తిని నిలుపుకోవాలనే నా ప్రయత్నం: కాని, లాభంలేదు. ప్రశాంతి కోసం నేను బాధపడ్డకొద్దీ నాలో అశాంతి జ్వాలలు.'

1862 లో అనుకోకుండానే, అంతవరకూ సోన్యాని పెళ్ళాడతానని చటుక్కున ఆమె చెల్లెలు లీజాను పెళ్ళాడాడు. ముప్ఫయినాలుగేళ్ళ టాలుస్టాయి; పద్దెనిమిదేళ్ళ లీజా. అదే 'సంసారసుఖం' కథ.

అనతికాలానికే ఆ కలలు కరిగి ఆ ఆశలు చెరిగిపోయాయి. అది వేరేకథ.

1870 వచ్చింది. అప్పటి టాలుస్టాయిని గురించి, వాళ్ళింటి ప్రవేటు మాస్టారు వ్రాస్తున్నాడు :

'ఒకసారి టాలుస్టాయి చాలా కంగారుగా నాదగ్గరికి పరుగెత్తుకొచ్చాడు. నా సహాయం కావాలన్నాడు. అతను దేనికో ఆందోళన పడుతున్నాడని గ్రహించి, నేనేమి చేయగలనా అని ఆశ్చర్యపోయాను. 'నన్ను రక్షించాలి. నేను పతనం పొందుతున్నాను.' ఏదో పిచ్చెత్తినట్టనిపించి భయపడ్డాను.

'ఆదేమిటో చెప్పండి?' అన్నాను.

'నాలో రగుల్కొనే ఉద్రేకాన్ని భరించలేక పోతున్నాను. నేను లొంగిపోతానేమో! నాకు భయంగా ఉంది. నాకు నీ సాయం కావాలి."

'నేనూ అలాంటివాణ్ణే. నేనేం చేయగలను?'

'చెయ్యగలవ్ కాదనకు.'

'ఏం చెయ్యమంటారో చెప్పండి??

'నేను బయటకు వెళ్ళినప్పుడల్లా నాతో కూడారా. మనిద్దరం కలసి కబుర్లు చెప్పుకొంటూ పోతే అసలు ఆ ఆలోచనేరాదు'

మేము షికారు వెళ్ళాం. ప్రతిరోజూ తాను షికారు వెళ్ళినప్పుడు డొన్నాని ఎలా కలుసుకొంటూండేవాడో ఆ కథంతా చెప్పేవాడు. (ఆమె భర్త సైన్యంలో ఉన్నాడు; వయస్సు ఇరవై రెండో, ఇరవై మూడో ఉంటుంది. అంత అందకత్తె కాకపోయినా 'నెత్తురూ పాలూ రంగరించినట్లు'ంటుంది—పొడుగ్గా, ఆరోగ్యంగా,

ఉండేది. ఆ తరవాత ఆవిడ వెంటబడి ఈలవేయటం ఒక సరదా. చివరకి సంకేత స్థలాన్ని ఏర్పాటు చేసుకోవటంతో ముగిసింది. [ఆ సంకేతస్థలం కూడా దొడ్లో తోటలో మారుమూల. అక్కడికి వెళ్ళాలంటే పడమటింటి గది కిటికీల ముందు నుంచి వెళ్ళాలి. ఆ గదిలో పిల్లలు చదువుకొంటూంటారు] ఆ కిటికీలదాటి, ఆ సంకేతస్థలానికి వెళ్ళటం ఒక బ్రహ్మప్రయత్నంగా ఉండేది. ఆత్మకీ ఇంద్రియోద్రేకానికి విపరీతమైన సంఘర్షణ. తీరా సమయానికి, అతని కొడుకు ఇల్యా కిటికీలోంచి చూసి, ఆవేళ గ్రీకుపాఠం చెపుతానని తండ్రి చెప్పిన సంగతి జ్ఞాపకం చేసి ఆపుచేసేవాడు. ఆ క్షణం అతని ఆందోళనకే ఆవృత్తి. చటుక్కున మేల్కొని, సంకేత ప్రయాణాన్ని కట్టిపెట్టి, ధన్యుడైనట్టు సంతోషించేవాడు. అయితే అంతటితో ఆఖరవలేదు. అతనిలో ఇంద్రియోద్రేకం విజృంభించి బాధించ సాగేది. భక్తిశ్లోకాలు పఠించేవాడు; లాభంలేదు. తను వట్టి మూర్ఖుణ్ణని నిందించుకొనేవాడు. తన శక్తిహీనతకు అసహ్యించుకొనేవాడు. ఎప్పుడో, ఏ క్షణమో లొంగిపోతాననే భయం. అందుకే ఎవరితోనన్నా, తను పడుతూన్న దుర్భరావస్థనీ, తన నిస్సహాయతనీ కొంత చెప్పుకొంటే గుండె తేలికౌతుందనే ఆశ. అందుకే నాతో వచ్చి తన దుఃఖాన్నంతా చెప్పుకొని—తద్వారా దాన్ని తానే అసహ్యించుకోవాలని. ఒంటరిగా బైటకెక్కడికీ పోకుండా, ఇంకొకడితో వెడితే, ఆ ఉద్రేకం ఉపశమిస్తుందనీ, ఆధోరణి అడుగున పడిపోతుందనీ ఆశ. పైగా దొన్నాని ఆ ఊరినుంచి తరిమివేశాడు.'

టాలుస్టాయికి అక్సీన్యాతో సంబంధం కలిగిన పన్నెండేళ్ల తరువాత కథ ఇది. 'దయ్యం పట్టిన మనిషి' ఇంతకి పంతొమ్మిదేళ్ళముందే రాయబడింది. అయినా దీనికీ దానికీ ఒక అవినాభావ సంబంధం.

టాలుస్టాయివి ఎంత జారేకాళ్ళయినా "ప్రజలు నా శీలానికి నన్ను ప్రస్తుతించేవారు. నా కాలంవాళ్ళకూడా నన్ను తమతో పోల్చుకొని చాలా నీతిపరుణ్ణని భావించేవారు; భావిస్తున్నారు కూడా."

ఏమైనా టాలుస్టాయి ఇతరులంటే ఆత్మనిగ్రహానికి తీసిపోడు; కాని, అతను నిగ్రహించుకోవలసింది ఇంకా ఎక్కువే వుంది.

ఈ 'దయ్యంపట్టిన మనిషి' అతని జీవితాన్ని ఆజన్మాంతమూ పట్టుకొని

ఇది ఇంచుమించు టాలుస్టాయి ఆత్మకథే కనుక—చప్పున ప్రచురింప బడ టానికి వీలిచ్చింది కాదు. ఈ గాధ అతని భార్యకు దుఃఖకారణం కనుక అతను 20 నవంబరు 1910 లో పరమపదించినా కూడా 1940 దాకా ప్రచురణకాలేదు. అంటే వ్రాసిన ఏభై ఒక్క సంవత్సరాలకు గాని [రచన : 1889] తొలిసారి అచ్చు కాలేదన్నమాట. ఈ సారి ఈ కథ చదవటమే మంచిది.

— రాంషా.



# దయ్యం పట్టిన మనిషి

ఎజినీ కళ్ళముందు అపూర్వమైన అదృష్టం కనిపిస్తోంది. ఆ అదృష్టాన్ని పొందగల అవకాశాలు కూడా అతని కున్నాయి; బాగా చదువుకున్నవాడు; విశ్వవిద్యాలయంవారి 'లా' పరీక్షలో పట్టభద్రుడయ్యాడు; పోగా, ఒక మంత్రిగారి సంరక్షణక్రింద అప్పుడే సెక్రటేరియేట్‌లో ఉన్నతోద్యోగాన్ని నిర్వహిస్తున్నాడు కూడా. అదికాక అతనికి ఆస్థికూడా ఉంది. ఉండేవో ఊడేదో చెప్పలేంగాని చాలా పెద్ద ఆస్తే. తండ్రి నానా దేశాలు తిరిగివచ్చిన మనిషి. అతని చేతికి ఎముకలేకుండా ఖర్చుపెట్టాడు. తన ఇద్దరు కొడుకులకీ సాలీనా తలో ఆరువేలు ఇష్టంవొచ్చినట్టు ఖర్చు పెట్టుకోమని ఇచ్చేవాడు. కుప్పనూర్పుల కాలంలో ఒకటిరెండు నెలలు మాత్రమే తన జమీలో గడిపి వసూళ్ళు పూర్తికాగానే వెళ్ళిపోయేవాడు. ఆ తరువాత ఆ జమీ అతీగతీ అతను పట్టించుకొనేవాడు కాదు. పోతే దాని నిర్వాకం అంతా ఒక నిద్దరమత్తు మేనేజరుది. అతనికి దాని పట్టింపు లేక పోయింది. అయినా ఆ మేనేజరంటే ఆ ముసలి జమీందారుకి ప్రాణమే.

తీరా తండ్రి చచ్చిపోయి, అన్నదమ్ములు పంపకానికొచ్చేసరికి వందలకొద్దీ అప్పులు నిప్పులు కక్కుతూ ప్రత్యక్షమయ్యాయి. వాటిని చూసి, వాళ్ళ లాయరే భయపడి, ఆ పిత్రార్జితానికే తిలోదకాలిమ్మన్నాడు. అమ్మమ్మగారి జమీతో తృప్తిపడితే మంచిదన్నాడు. అదైనా సామాన్యపు ఆస్థి కాదు. చచ్చు నూరువేలన్నా ఖరీదు చేస్తుంది.

కాని, అలా జరగలేదు. పొరుగు జమీందారొకాయన, ఈ ముసలి జమీందారుతో పూర్వం వ్యాపారం చేసిన పెద్దమనిషి, తనకివ్వవలసిన నోటు బాకీలను

చూపిస్తూ ఒక కొత్తసలహా చెప్పాడు. అడివినీ, దానిచుట్టుపక్క భూముల్నీ అమ్మి ఋణాలు తీర్చుకొంటే, నాలుగువేల ఎకరాల పాటిమట్టి జమీనీ, పంచదార ఫ్యాక్టరీనీ, రెండువందల ఎకరాల పళ్లపుశేలనీ మిగుల్చుకోవచ్చునని ఆయన అన్నాడు. ఆ వ్యవసాయాన్నన్నా తాము దగ్గరుండి, కంటికి రెప్పలా చూసుకొంటూ, అక్కడే స్థిరపడి, పొదుపుగా తెలివిగా గడుపుకొంటే నాలుగురాళ్ళు కూడబెట్టుకోవచ్చునన్నాడు.

ఆమాటపై తొలకరిలోనే ఎజినీ తన జమీకి వచ్చేశాడు. పరిస్థితులన్నీ పరిశీలించాడు. తన సివిల్ సర్వీస్ ఉద్యోగానికి ఉద్వాసన చెప్పేశాడు. చివరికి ముఖ్యమైన ఎస్టేటునన్నా నిలుపుకోవాలనే సంకల్పంతో తన తల్లిని కూడా తెచ్చుకొని, తనే పెత్తందారీ వహించాడు.

ఇక తన అన్నగారు ఆంద్రూ కూడా తన మాట కాదనే ఘటంకాదు. అతనికి సాలీనా నాలుగువేలు కాని, లేదా ఒక్కసారి ఎనభైవేలు కాని ముట్టచెబుతానని చెప్పి ఒప్పించి అతని వాటా కూడా తన పెత్తనం క్రిందకి తెచ్చుకొన్నాడు.

ఈ విధంగా సమస్యలని ఒక కొలికికి తెచ్చి, తన తల్లితో కలిసి తన స్వంత భవనంలో స్థిరపడి- తన జమీని ఎంతో ఆదుర్దాగా—అయినా జాగ్రత్తగా—నిర్వహించుకొస్తున్నాడు.

సాధారణంగా చాదస్తులంటే ముసలవాళ్ళనీ, మార్పును బలపరచే వాళ్ళంతా యువకులనీ అనుకోవటం ఉంది. కాని, అది నిజంకాదు. సామాన్యంగా యువకులే ఛాదస్తులౌతారు; వాళ్ళకి బ్రతకాలని ఉంటుంది. ఎలా బతకాలో వాళ్ళు ఆలోచించరు; ఆలోచించటానికి వాళ్ళకి అవకాశం కూడా ఉండదు. అందుకని, వాళ్ళకు తెలిసిన ఏదో జీవితాన్ని నమూనాగా తీసుకొని ఆ ప్రకారం నడుస్తారు.

ఎజినీ సంగతికూడా అంతే. ఆపల్లెటూళ్ళో స్థిరపడ్డాక, పూర్వం ఉండే జీవిత విధానాన్ని మళ్ళీ పునః ప్రతిష్ఠించాలని సంకల్పించాడు. అతని ఆశయం, అతని ఆదర్శం కూడా అదే. ఆ విధానం తన తండ్రి నాటిదికాదు—తన తండ్రి సరిగ్గా నిర్వాకం చేయలేదని అతని అభిప్రాయం. పోతే, తన తాతగారి కాలానిది. ఆ ఆశయంతో తన ఇంట్లోనూ తోటలోనూ, జమీందారీ ఫాయిదాలోనూ అంతటా తన తాతగారి పద్ధతినే ప్రవేశపెట్టాలని ప్రయత్నించాడు. అంటే బొత్తిగా నగర వాయిద్యాలదగ్గరకీ, తురాయి కిరీటాల దగ్గరకీ పోయాడని కాదు. కాలానుగుణ్యమైన మార్పుల్ని పాటిస్తూనే ఒక పద్ధతిలో సక్రమంగా నడిపి అందర్నీ తృప్తి పరిచాడు. ఇదేమీ సామాన్యమైన పనికాదు. ఇటుచూస్తే రుణదాతలూ, అటుచూస్తే బ్యాంకులూ కళ్ళురిమిచూస్తున్నాయి. వాటిని ఒదుల్చుకోవాలంటే కొంతఆస్థి తనదికాదనుకోవాలి. మరికొన్ని కొత్తఋణాలు కూడా చెయ్యాలి. కొంత వ్యవసాయానికి, కొంత కూలీల

కనీ, ఖర్చు ఉండనే ఉంది. ఎండి నెరియలుపడ్డ ఎస్టేటు; తుప్పుపట్టిన పంచదార ఫ్యాక్టరీ; దిక్కులేని పువ్వులతోటా ఇవన్నీ తనకోసం ఎదురు చూస్తున్నాయి.

కావలసినంత పనిఉంది. ఎజనీకి కూడా కావలసినంత బలంఉంది. శారీరకంగా, మానసికంగా ఇంకో అంత పనైనాసరే తట్టుకోగలడు. ఇరవైఆరో ఏడు; వయస్సుకు తగ్గ ఎత్తు; కండలు తిరిగిన శరీరం; ఒంట్లో చిక్కటి నెత్తురు—ఇంకఉన్న లోపమల్లా ఒక్క దగ్గరవస్తువులు అనక పోవటమే. అదైనా చిన్న తనంలో సరదాగా కళ్ళజోడు వాడటం వల్ల వచ్చింది. ఇక కళ్ళజోడు తప్పలేదు. ముక్కుదూలం మీద ఆనవాలు కూడా పడ్డది. అదీ అతని భౌతిక మూర్తి.

ఇంక ఆంతరంగికంగా జనం అతన్ని తెలుసుకొన్న కొద్దీ అభిమానిస్తారు. ఇక ప్రపంచంలో ఎవరూ అతని తల్లి అంత ఇదిగా ప్రేమించిన వాళ్ళులేరు. అందులో ఆమెకు భర్తపోయిన తర్వాత ఆమె అభిమానాన్నే కాక ఆమె జీవితాన్నే అతనికి ధారపోసింది. అతన్ని అంతగాఢంగా ప్రేమించే వ్యక్తులు ఇంకా ఉన్నారు. హైస్కూల్లోనూ, కాలేజీలోనూ, విశ్వవిద్యాలయంలోనూ అతను చదువు కొంటున్న రోజుల్లో, అతనంటే ఇష్టమే కాకుండా, అతన్ని గౌరవించే వారుకూడా. అతన్ని కలుసుకున్న వాళ్ళంతా అలాగే తయారయ్యేవారు. అతను చెప్పింది నమ్మకపోవటం గాని, అంత చక్కని, నిర్మలమైన అతని ప్రసన్న వదనంలో మాయగాని మోసం గాని ఉంటుందని అనుకోవటం ఎవరికీ సాధ్యం కాదు.

ఒక్కమాటలో చెప్పాలంటే అతని మూర్తే అన్నింట్లోనూ అతనికి సహాయం చేసిందంటే చాలు. ఇంకొకడైతే మెడపట్టి గెంటించే రుణదాతకూడా అతన్ని నమ్మేవాడు. గుమస్తాలు, గ్రామపెద్దలు, రైతులు—ఎవరుకానీ, ఎట్లాంటి మోసాలు చేసే గోసాయి చిట్కావాళ్ళుగానీ ఈమనిషి నవ్వుతున్న ముఖం చూసేసరికి తమ చిట్కాలన్నీ మరిచిపోయేవారు. ఆ మంచితనం, ఆకలివిడి, ఆ ఠీవి, అతనికే చెల్లింది.

చైత్రమాసాంతాని కల్లా ఎలాగో తంటాలుపడి కొంత భూమిమీద తనఖా తప్పించి, అది అమ్మతాననే ఆశ చూపించి ఒక షావుకారునుంచి డబ్బు అప్పు తెచ్చాడు. ఆ డబ్బుతో కొన్ని గుర్రాల్ని, ఎద్దుల్నీ, బళ్ళనీ కొని ఒక పశువులపాక కట్టాలని కూడా అతని ఉద్దేశం. ఆ ప్రయత్నం కొనసాగుతోంది. కలప తోలుకొస్తున్నారు. వడ్రంగులు చెమట ఓడుస్తున్నారు. ఎనభైబళ్ళ పెంటకూడా వస్తోంది. అంతా ఒక త్రాటిమీద నడుస్తోంది.

*    *    *    *    *    *

ఒకమూల అంతపనీ రద్దీతో కొట్టుకొంటూ ఉంటే అంత ముఖ్యంకాని ఒక విషయం అతన్ని బాధించ సాగింది. యువకుడైన తను కూడా ఇతర యువకుల్లాగే

ఆరోగ్యంగా బ్రతికాడు; అంటే, రకరకాల స్త్రీలతో ఇతనికి కూడా సంబంధం ఉండేదన్నమాట. అతనేమీ జులాయి కాదు కాని, అతనే ఒకసారి అన్నట్టు, పరమ హంస కూడా కాదు. తన శరీరారోగ్యాన్ని కాపాడుకోవటానికనీ, తన మనస్సును నిర్మలంగా ఉంచుకోవటానికనీ. అతనిలా దిగక తప్పలేదు ఆతని అభిప్రాయం కూడా అదే. ఈ వ్యావృత్తి అతనికి పదహారోఏట ప్రారంభమయింది. అప్పట్నించీ సంతృప్తికరంగానే సాగిపోతోంది—అంటే పచ్చి వ్యభిచారానికి దిగటంకాని, లేక పదిమందిలోనూ అల్లరి పడటంగాని, లేదా ఏసుఖవ్యాధినో తగిలించుకోవటంగాని జరగలేదన్న మాట. మొదటిసారి పీటర్స్ బర్గులోనే ఒక దర్జీ మనిషిని పట్టుకొన్నాడు. కాని, ఆమె చెడిపోవటంవల్ల మరో ఏర్పాటు చేసుకొన్నాడు. ఆ బాపతు వ్యవహారాల నన్నింటినీ జాగ్రత్తగా నిర్వహించుకోవటం వల్ల అతనికేమీ ఇబ్బంది కలగలేదు.

ఇక గత్యంతరం లేక ఈ పల్లెటూళ్ళో పడ్డాడు. ఇప్పటికే రెండు నెలలు కావచ్చింది. ఏమి చెయ్యాలో అతనికి తోచటం లేదు. ఇక బలవంతపు ఆత్మ నిగ్రహం ఇప్పటికే అతని ప్రాణాలమీద కొచ్చింది.

కేవలం ఇందుకోసమనే తానింక బస్తీకి పోవాలా? ఎక్కడికని? ఎలాగని? ఇదే అతని మనస్సును కలవర పెట్టిన సంగతి. అతనికిది చాలా అవసరమనీ, ఇంక తప్పదనీ అతనెప్పుడైతే ఒక నిశ్చయాని కొచ్చాడో నిజంగా అది తప్పనిసరై కూర్చుంది. తను స్వేచ్ఛగా లేననుకున్నాడు. అనుకోవటం తోటే అతనికళ్ళు, అతనికి తెలియకుండానే, అందగత్తెల్ని అనుసరించటం ప్రారంభించాయి.

తాను ఉన్న ఊళ్ళో పెళ్ళయిన దానితో కాని, పెళ్ళి కాని దానితో కాని సంబంధం పెట్టుకోవటం అతని కిష్టంలేదు. ఈ విషయంలో తన తండ్రికాని, తన తాతగారు కాని ఇతర జమిందారుల్లా వర్తించేవారు కాదని అతనికి తెలుసు. ఉన్న ఊళ్ళో ఎంత అందగత్తెలు కానీ రైతు స్త్రీలతో ఎన్నడూ సంబంధాలు పెట్టుకొనేవారు కాదు తను కూడా అలాగే ఉండాలని అతను నిశ్చయించుకున్నాడు. కాని, ఆ తరువాత అనునిత్యమూ పెచ్చుపెరిగి పోతున్న బాధనీ పొరుగూళ్ళో తనె లాంటి భయంకర దుస్థితిలో పడవలసి వస్తుందో ఊహించి చిత్రించుకొనీ, దాసత్వపు రోజులు పొయ్యాయనే సత్యాన్ని తలపోసుకొని—చివరికి ఉన్న ఊళ్ళోనే చక్కబెట్టక తప్పదనుకున్నాడు. 'ఏమైనా మూడోకంటి వాడికి తెలియకుండానే గప్ చిప్‌గా జరిగిపోవాలి. వ్యభిచారం కోసం కాదుకనుక—కేవలం ఆరోగ్యం కోసంమే కనుక'—అనుకున్నాడు. అనుకున్న క్షణాన్నుంచీ మరీ చికాకు ఎక్కువై పోయింది. ఇక గ్రామపెద్దలోటీ, రైతులతోటీ వడ్రంగులతోటీ కబుర్లు చెబుతున్నప్పుడు

ఆదమరపుగా ఆడవాళ్ళ ప్రసక్తితీసుకొచ్చేవాడు. ఇక అటుమళ్ళితేచాలు ఆ కథ సాంతం సాగవలసిందే. ఆడవాళ్ళ కేసి ఆదేవెర్రిగా చూడటం.

*        *        *        *        *

ఏదైనా ఒక నిర్ణయానికి రావటం ఒక ఎత్తు; దానిని కార్యరూపంలోకి తేవటం ఒకఎత్తూను. ఒకఆడదాన్ని సమీపించటం పొత్తిగా అసాధ్యమైనపని. ఎవరితో? ఎక్కడ? ఎవరి ద్వారానో ఒకరి ద్వారా జరగాలి; అయితే ఈ సంగతి ఎవరితో చెప్పటం?

ఒకసారి అడివిలో మంచి నీళ్ళకోసం ఒక కాపలా వాడి కుటీరంలోకి వెళ్ళాడు. ఆ కాపాలావాడే తన తండ్రికి వేటగాడుకూడా. ఎజినీ వాడితో కబుర్లు పెట్టాడు, తన తండ్రితో కలిసి అతను చెవలపిల్లుల్ని ఎలా వేటాడేవాడో, ఆచిత్రమైన కథలన్నీ అతను చెప్తున్నాడు. వింటూనే ఈ గుడిసెలోనో, ఈ అడివిలోనో తనకు కావలసిన సంగతిని ఏర్పాటు చేసుకొంటే చాలాబావుంటుందని అనుకున్నాడు; కథ ఎలా నడిపించాలో మాత్రం అతకి తెలియదు. ఈ ముసలి డానియల్ అందుకు ఒప్పుకుంటాడో లేదో! 'బహుశా నా నోటినుంచి ఇలాంటి మాటలు విని తెల్లబోతే! నా తెలివి తక్కువను బైట పెట్టుకున్నందుకు నాకు సిగ్గుకాదా! ఏమో, వినీ వినగానే చడీచప్పుడూ లేకుండా అంగీకరిస్తాడేమో!' డానియల్ కథలు వింటూ ఇలా ఆలోచించ సాగించాడు. ఒకసారి పొలంలో ఒక రైతు ఇంటికి వెళ్ళి తన తండ్రికోసం ఒక రైతుభార్యను ఎలా తీసుకొచ్చాడో డేనియల్ చెబుతున్నాడు.

"ఇంక నేః ఘవాతేదు" ఎజినీ అనుకున్నాడు.

"మీనాన్నగారు, మహానుభావుడు. చచ్చి స్వర్గాన ఉన్నాడు. ఎన్నడూ దుర్మార్గానికి ఒడిగట్టుకోలేదు."

"లాభంలేదు" అనుకున్నాడు ఎజినీ. అయినా పరీక్షించి చూడాలి. "అలాంటి చెత్తగొడవల్లోకి నువ్వు ఎల్లా దిగేవా అని!"

"అందులో తప్పేముంది బాబూ! అదా, సంతోషించేది; అయ్యగారా, తృప్తిపడేవారు; చాలా తృప్తిపడేవారు లెండి. నాకా, ఒకటో రెండో చేతులో పడేవి. ఏం ఆయన మాత్రం ఏం చేస్తారు చెప్పండి? ఆయనకీ సజీవమైన శరీరమేగా? అందులోనూ వైన్ త్రాగేవారు కూడా"

"ఈసారి నాగొడవ చెప్పుకోవచ్చు" అనుకున్నాడు ఎజినీ. అందుకు ఉపక్రమించాడు కూడా.

"డానియల్, నేనెంత అవస్థ పడుతున్నానో నీకేం తెలుసు! ఎలా భరించాలో తెలియటంలేదు—" ముఖం కందగడ్డ అవుతూన్నట్టనిపించింది.

డానియల్ నవ్వాడు.

"నేనేమీ పరమహంసను కాను—దానికి అలవాటు పడ్డాను కూడా."

తను చాలా తెలివి తక్కువగా మాట్లాడుతున్నానని ఎజినీ గ్రహించాడు. కాని డానియలు తన మాటకి అంగీకరించి ఊరుకోవటం చాలా సంతోషమయింది.

"నక్కి, ఇదెంత భాగ్యం!—ఈమాట ఇదివరకే చెప్పిఉంటే ఈపాటికి అన్నీ ఏర్పాట్లూ చేసిఉండేవాడిని. ఇంతకీ మీకెవరు కావాలో చెప్పండి."

"ఓ, ఎవరైనా ఒకటేలెద్దూ. బొత్తిగా అనాకారి కాకూడదు. అంతే; ఆరోగ్యం మాత్రం బాగుండాలి."

"తెలిసిందిలెండి!" డానియలు క్లుప్తంగా అని ఊరుకున్నాడు. ఆలోచించాడు.

"ఆఁ, ఒకతే సరుకుందిలెండి." ఎజినీ ముఖం నవ్వి ఎర్రబడింది. "ఒకతే ధుమాగా ఉంటుంది. మొన్ననే పెళ్ళయింది కూడా." డానియలు గుసగుస లాడేడు—"వాడేమీ చెయ్యలేక పోయాడంటే నమ్మండి దాన్నికోసం వాడు ఎంత డబ్బు కుమ్మరిస్తాడో ఆలోచించండి."

అవమానంతో ఎజినీ ముఖంచిట్లించాడు.

"అదికాదోయ్," అన్నాడు. "అది నాకంత ముఖ్యం కాదు. ఇంక ఎటొచ్చీ, [ఏమిటి ఎటొచ్చి?] ఎటొచ్చీ ఆరోగ్యమైనదీ, గొడవలు రానిదీ కావాలి. చూడు, మొగుడు ఏ సైన్యంలోనో—అలాంటిదేదో అయితే బావుంటుంది."

"తెలుసులెండి. అయితే స్టెపానిడాని తీసుకురావాలన్న మాట. దాని మొగుడు పట్నంలో ఉన్నాడు. అంటే సైన్యంలో ఉన్నట్టే. అది చాలా మంచి ఆడదే; శుభ్రంగా ఉంటుంది. మీరు చాలా ఆనందిస్తారులెండి. నిన్ననే దానితో చెప్పానా అన్నట్టయింది—కాదు మీరింక వెళ్ళండి చెప్తాను. కాని అది—"

"సరే, ఎప్పుడు మరి?"

"మీ ఇష్టం రేపే కానివ్వండి. చుట్టముక్క కోసం అని వెళ్ళిలాక్కొస్తాను. మధ్యాహ్నం పన్నెండింటికల్లా—వీళ్ళగదిలేదూ అందులో—అక్కడెవరూ ఉండరులెండి—భోజనాల తర్వాత అంతా కునుకు తీస్తుంటారు."

"సరే అయితే."

ఎజినీ ఇంటికెళుతూన్నప్పుడు అతనిలో మహోద్రేకం విజృంభించింది. "ఏం జరుగుతుందో? రైతుపెళ్ళాం ఎట్లా ఉంటుందో? వల్లమాలిన సిగ్గు ఉన్నదయితే? బొత్తిగా కురూపి అయితే? అబ్బే ఆమె చాలా అందంగా ఉంటుంది." తాను ఇదివరకు చూసిన వాళ్ళని జ్ఞాపకం తెచ్చుకొని కొంత సమాధాన పడ్డాడు. "అయితే ఏమి చెప్పాలి? ఏమి చెయ్యాలి?"

ఆరోజల్లా అతను తనలో లేడు. ఆ మరునాడు మిట్టమధ్యాహ్నం ఆ కాపలా వాడి గుడిసె దగ్గరికి వెళ్ళాడు. డానియలు గుమ్మంముందు నిల్చొని మౌనంగా అడివి కేసి తల ఆడించి చూపించాడు. ఎజిలీ గుండెల్లో నెత్తురు పోటెక్కింది. ఆసంగతి అతనికి తెలుసు. చల్లగా తోటలోకి వెళ్ళాడు. అక్కడెవరూ లేరు. స్నానాల గది లోకి వెళ్ళాడు.—అక్కడ కూడా ఎవరూలేరు; తొంగిచూసి నిరాశగా బైటికి వచ్చేశాడు. ఏదో కొమ్మ విరిగిన శబ్దం అకస్మాత్తుగా చెవుల్లో పడింది. చుట్టూ చూశాడు. చిన్న కనుమ వెనకాల పొదప్రక్క నిలబడి చూస్తోంది. ఒక్క ఉరకలో ఆ కనుమదాటి ముందుకెళ్ళాడు. అక్కడ దూలగొండి మొక్కలున్నట్టు అతనికి తెలియదు. అవి చేతులకు రాసుకున్నాయి. కళ్ళజోడు ఊడిపడింది. ఎలాగో ఆమె ముందు పడ్డాడు. ఆమె అలాగే నించుని చూస్తోంది. అతి తెల్లని చీర—జరీ అంచుల చీరకట్టుకొంది. ఎర్రని రవికె. అప్పుడే చిలికి తీసిన వెన్నపూసలా, దృఢంగా, అందంగా, సిగ్గుగా నవ్వుతూ ఆమె అలాగే చూస్తోంది.

“పక్కనే దారి ఉందిగా—అలా చుట్టు తిరిగివస్తే మునిగి పోయిందా!” అంది. “నేనువచ్చి చాలా సేపయింది.”

అతను, ఆమెకు దగ్గిరగా వెళ్ళి, నిదానించి చూసి, ముట్టుకున్నాడు.

ఒక పావుగంట తరువాత వాళ్లు విడిపోయారు; తన కళ్లజోడు వెతుక్కొని, డానియల్ ని పిలిచి. ‘బాగుందా, దొరగారూ?’ అన్న అతని ప్రశ్నకు జవాబుగా చేతిలో రెండు నాణేలుపడేసి, ఇంటికి వెళ్లి పోయాడు.

అతను చాలా తృప్తిపడ్డాడు. మొదట కొంచెం సిగ్గులాంటిది వచ్చినా, అది తరువాత గడిచి పోయింది. మొత్తానికి అంతా బాగానే జరిగింది. విశేషమేమిటంటే, ఈ సారి అతనికి చాలా కులాసాగా ఉంది. ఒళ్లు తేలికబడి, నవనవలాడు తున్నట్టుంది. ఆమె చాలా స్వచ్ఛంగా, కొత్తగా ఉన్నదనీ, ఏమీ అనాకారి కాదనీ, ఏ విధమైన నటనా లేకుండా దివ్యంగా ఉందనీ జ్ఞాపకం తెచ్చుకొన్నాడు. ‘ఈవిడ ఎవరి భార్యచెప్మా?’ తనని తానే ప్రశ్నించు కొన్నాడు. ‘షీనికోవ్ భార్యఅని కదా డానియల్ అన్నాడు ఏ షీనికోవ్ చెప్మా?’ ఆపేరుగలవాళ్లు తన ఎరకలో ఇద్దరున్నారు. ‘బహుశా ముసలిమైఖేల్ కోడలై ఉంటుంది. అవును, అంతే అయి ఉంటుంది. అతని కొడుకు మాస్కోలో ఉన్నాడుకూడా. ఎప్పుడో డేనియల్ నే అడిగితే తీరిపోతుంది.’

అప్పట్నుంచీ, డానియల్ ధర్మమా అని, ఆ పల్లె జీవితంలో అతనికున్న ఒకే ఒక్క అవరోధం—బలవంతపు ఇంద్రియ నిగ్రహం—కాస్తా తొలగిపోయింది. ఇక అతని భావస్వాతంత్ర్యానికి కూడా ఏ అడ్డూ లేక పోయింది. దానితో స్వేచ్ఛగా తన పనులు చూసుకోవటం ప్రారంభించాడు.

ఇక ఎజినీ పూనుకున్న పనికూడా అంత తేలికైనది కాదు. చెరువుగట్టుకు ఒక గండి పూడిస్తే ఇంకో గండి తయారయ్యేది. ఇలా అయితే ఉన్న జమీని కాస్తా తాను అమ్ముకు పోవలసిందే. అంటే తన కృషియావత్తూ బూడిదలో పోసిన పన్నీరవటమే కదా! తాను తీసుకున్న పని నిర్వర్తించలేని వాడవుతాడు. అదే అతన్ని ఎక్కువగా, ఆ తరువాత, బాధించసాగింది.

ఈ లోగా, పిత్రార్జితం బాపతు అనుకోని ఋణాలన్నీ పైకి రావటం ప్రారంభించాయి. దాన్నిబట్టి చూస్తే, ముసలాయన జీవితం ఆఖరయ్యేవరకూ, ఈచేతా ఆచేతా కూడా అంకిన కాటికి అప్పుచేసినట్లు అర్థమౌతోంది. తొలకరిలో తాను స్థిరపడే సరికి తండ్రిగారి ఋణాలన్నీ బైటకొచ్చేశాయి కదా అనుకున్నాడు. కాని, ఇంతలో ఒకావిడ తనకి ముసలాయన పన్నెండు వేలివ్వాలని పిడుగులాంటి ఉత్తరం. ప్రాంశరీ నోటు లేదటగాని, మామూలు రశీదు ఉందట. ఆ రశీదు దాఖలు చేస్తేచాలని ఆమె లాయరు చెప్పాడట కూడా. సరి అయిన కాయితం లేదుగనుక తానుడబ్బు ఎగవేయ వచ్చునని ఎజినీకి తట్టలేదు. అసలు అలాంటి అప్పు అనేది ఏదన్నా ఉందేమో తెలుసుకోవాలని అనుకున్నాడు.

"అమ్మా! కవేరియా ఎసీపోవా ఎవరే?" భోజనాలముందు తల్లనడిగాడు.

"ఎసిపోవా? మీ తాతయ్య పెంచాడులే దాన్ని. ఏం?"

ఎజినీ ఆఉత్తరం సంగతి తల్లితో చెప్పాడు.

"నిన్ను అడగటానికి దానికి సిగ్గన్నాలేక పోయిందేమో! మీనాన్న దానికి ఎంత డబ్బిచ్చారని!"

"ఇంతకీ మనం ఇవ్వాలా అఖ్కర్లేదా?"

"ఎన్నెలా చెప్పమంటావ్ నాయనా! బాకీ ఏం కాదు మీ నాన్నగారు ఆయన దయకొద్దీ..."

"అవునుకో, నాన్నగారు అదొక ఋణం అనుకున్నారా?"

"నేనేమీ చెప్పలేను. నాకు తెలియదుకూడా. ఇప్పటికే నీకు తలమునగా ఋణాలున్నాయి కదా అని..."

మేరీకి ఏం చెప్పాలో తోచటం లేదని ఎజినీ గ్రహించాడు. ఆ మాటల్లోని ధ్వని అతనికి అర్థం కాక పోలేదు.

"నీ మాటనిబట్టిచూస్తే మనం ఆఋణం తీర్చటమే మంచిదనుకుంటాను. రేపు నేనే వెళ్ళి, ఆమెతో స్వయంగా మాట్లాడి. వాయిదా పుచ్చుకొంటాను."

"ఏం చెప్పను నాయనా; నీకెలా తోస్తే అలాచెయ్. నాలుగు రోజుల పాటు ఆగమని చెప్పు." తన కొడుకు నిర్ణయానికి ఆమె కెంతో గర్వం వచ్చింది.

ఎజినీ స్థితి చాలా చికాకుగాఉంది; ముఖ్యంగా అతని స్థితిని తల్లి గుర్తించక పోవటమే దానికి కారణం. ఆమె బ్రతికినంత కాలం రాజభోగిగా గడిపింది. చేతికి

ఎముక లేకుండా ఖర్చుపెట్టింది. అలాంటి మనిషికి ఈ వేళ కొడుకు ఏస్థితిలో ఉన్నాడో అర్థంకాదు. నిజానికి పరిస్థితులేమీ బాగో లేవు. ఉన్న కొంప్రకాస్తా ఇవాళో రేపో అమ్మక తప్పని పరిస్థితి వచ్చేసింది. తనే మన్నానాలుగు గాళ్లు సంపాదించుకోగలిగితేనే తల్లిని పోషించగలగటం. ఆ సంపాదనకూడా మహా అయితే రెండువేలుండేను. అన్ని ఖర్చులూ తగ్గించుకొంటేనేగాని ఆ దుస్థితినుంచి తప్పించుకోలేమని ఆమెకింకా తెలిసిరాలేదు. బళ్లవాళ్లు, బంట్రోతులు, తోట మాలీలు చివరికి భోజనం విషయంలో కూడా ఎజినీ ఎందుకంత లుబ్ధతగా ఉంటున్నాడో ఆమె గ్రహించలేకపోయింది. పైగా, అందరి వితంతువుల్లాగే, తన భర్త బ్రతికున్నప్పటి కంటే కొన్నిరెట్లు మోజుగా ఆయన్ని ధ్యానించ సాగింది. ఆయన చేతలూ, ఆయన ఏర్పాట్లూ ఎలాంటి వైనాసరే వాటిని మార్చకూడదని పట్టుబట్టేది. ఆయన జ్ఞాపకార్థం అవన్నీ యథా ప్రకారం సాగవలసిందే.

అతి కష్టం మీద ఎజినీ తన పరివారాన్ని నలుగురులోకి తగ్గించాడు. మేరీ తను తనకొడుకు కోసం ఇంత త్యాగం చెయ్యక తప్పదని ఊరుకొంది. అలా తల్లి కుండవలసిన ఓర్పునంతా వహిస్తూ, ముసలి వంటమనిషి వండిన నడింపలుకు భోజనాన్నీ, బాగుచెయ్యని కంకర తోటదారుల్నీ సహిస్తూ ఒక్క పనిమనిషితోటే సరిపెట్టుకొనేది.

అలాగే ఈ కొత్తరుణం విషయంలో కూడా. ఎజినీ వేసుకున్న ఆలోచనల కన్నింటికీ ఈ రుణం ఒక మహా విఘాతంలా కనిపిస్తే, ఆమెకు మాత్రం తన కొడుకులోని ఔదార్యం కనిపించింది. పోగా ఎజినీ స్థితినిగురించి ఆమెకేమీ ఆందోళన లేదు. ఏదో తగిన సంబంధం చూసుకొని ముడిపెట్టుకుంటాడనీ, దానితో అన్ని చిక్కులూ వదలిపోతాయనీ ఆమె ధైర్యం. అతనిలో ఆ సామర్థ్యం ఉందికూడా! కళ్ళకద్దుకొని తన కొడుక్కి పిల్లనిస్తామంటున్న కుటుంబాల్ని ఒకపరకదాకా ఆమెకు తెలుసు. సాధ్యమైనంత త్వరలో 'శుభం' అనిపిస్తే మంచిదని ఆవిడకూడా అనుకుంటూనే ఉంది.

* * * * *

ఎజినీకూడా పెళ్ళినిగురించి కలలు కంటున్నాడు; అయితే తల్లిలా కాదు. వ్యవహారాల చిక్కులు ఒదిలించుకోటానికై సాధనగా పెళ్ళిచేసుకోవాలనుకోవటం అతనికి ప్రాణసంకటంగా ఉంది. గౌరవంగా, ప్రేమకోసం, పెళ్ళిచేసుకోవాలని అతని ఆశ. తానిదివరకు కలుసుకున్న ఆడపిల్లల్నీ, తానిదివరకు ఎరిగి ఉన్న ఆడపిల్లల్నీ తనతో కలుపుకొని ఉజ్జీ ఎట్లా ఉంటుందో ఆలోచించేవాడు; కాని ఏనిర్ణయానికీ రాలేకపోయాడు. ఈలోగా, అతనను కొన్నట్టు కాకుండా, సైపానిడాతో సంబంధాలు సాగుతూనే ఉన్నాయి. స్థిరంగా ఉంచుకున్నాడా అన్నంతవరకూ వచ్చింది. అతనికీ వ్యభిచారానికీ కొన్ని ఆమడల దూరం ఉంది. తాను చెడ్డదనుకొన్న ఈపనిని

ఇలా రహస్యంగా కొనసాగించటం అతనికి ఇబ్బందిగానే ఉంది. ఇలాంటి సమావేశాల్ని తానే ఎందుకు ఏర్పాటు చేసుకోలేక పోతున్నాడాఅనీ, మళ్లీ సెపానిడాని కలుసుకో కూడదనీ అనుకునేవాడు. అనుకునే వాడేకాని, కొన్నాళ్లు గడిచే సరికి పిచ్చెత్తినట్టయి [తాను విశ్వసించిన కారణాలవల్ల] మళ్లీ దాలిసుంటని వెతుక్కునే వాడు. ఈ సారి అశాంతికి కారణం కేవలం వ్యక్తిగత మైనదే. ఆ మెరిసే నల్లని కళ్లనీ, 'చాలా సేపట్నుంచి' అని చెప్పే ఆ గంభీరమైన కంఠాన్నీ, ఆ దృఢమైన నవనూత్నమైన దేనిదో సుగంధాన్నీ, పయ్యెదనిపైకి ఎత్తిపట్టే నిండుపయోదాల ఉద్భృతాన్నీ, సూర్యకాంతిలో స్నానం చేసే గంగిరేణి పొదరింటిలోని అసామాన్య అనుభవాన్నీ ఆశ్రయించుకొని ఈ అశాంతి తీవ్రంగా విజృంభించేది.

తనకి ఎంతో సిగ్గయి నప్పటికీ చివరికి డానియల్ ని కలుసుకోక తప్పిందికాదు. మళ్ళీ అడవిలో ఒక సంకేతస్థలం ఏర్పాటయింది. ఈసారి ఎజినీ ఆమెని జాగ్రత్తగా పరకాయించి చూశాడు. చూసిన కొద్దీ ఆమె అందం ఎంతో ఆకర్షకంగా కనిపించింది. ఆమెతో మాట్లాడాలని ప్రయత్నించాడు. ఆమె భర్తని గురించి ప్రశ్నించాడు. నిజంగా అతను మైఖేల్ కొడుకే. మాస్కోలో బండి తోలుతుంటాడు.

"అయితే ఎందుకని నువ్వు..." ఎందుకని ఆమె తన భర్త కిట్లా అవిశ్వాసంగా ప్రవర్తిస్తోందో అడగాలనుకున్నాడు.

" 'ఎందుకని' ఏమిటి?" ఆమె అతన్నే అడిగింది. ఆమె తెలివితేటలకీ, చాతుర్యానికీ ఏమీ తీసిపోదు.

"అదికాదు; నాదగ్గిర కెందుకొస్తున్నావా అని!"

"అదా!" ఆవిడ నవ్వింది. "అక్కడ ముండలకి అతను మాత్రం పోవటంలా? అందుకే ఇక్కడ నేను"

ఆవిడిలో ఒక విధమైన పెంకితనం, ధీమా ఎజినీకి స్పష్టంగా కనిపించాయి. వాటిని చూడ ముచ్చటయింద కూడా. కాని మళ్ళీ తనంత తానుగా కొత్త సంకేతాన్ని ఏర్పాటుచేసుకోలేక పోయాడు. డానియల్ మధ్యవర్తిత్వం అక్కర్లేకుండానే ఎక్కడైనా కలుసుకుందామని ఆవిడ సూచించినా కూడా అతను అంగీకరించలేదు. ఇదే ఆఖరి సమావేశం కావాలని నిశ్చయించుకున్నాడు. ఆమె అంటే అతనికి ఇష్టం కూడా. అలాంటి సమాగమం తనకెంతో అవసరమనుకున్నాడు: అందులో చెడ్డ ఏమీలేదనుకున్నాడు. కాని, అతని గుండెల్లో మాత్రం, అంతరాత్మ న్యాయాధికారం చేతపట్టుకొని, ఇతని ఈ సాహసకృత్యాన్ని అంగీకరించలేదు. పోగా ఇంతటితో కట్టిపెట్టాలని శాసించింది. కట్టిపెట్టి తీరాలని అతను అనుకోక పోయినా మళ్ళీ ఇలాంటిఏర్పాట్లల్లో పాల్గోకూడదనైనా అతను భావించిఉంటాడు.

మొత్తానికి ఆ వేసంకాలం గడిచిపోయింది. ఆ నాలుగు నెలల్లోను డానియల్ సాయంతో ఒక డజను సార్లు కలుసుకున్నారు. ఒకసారి అతను రావటం, ఆ సమయానికి ఆమె భర్త ఊరి నుంచి వచ్చి ఉండటం వల్ల ఆమె రాలేక పోవటం, ఆ కొరతని తీర్చటం కోసం ఇంకొక స్త్రీని తీసుకొస్తానని డానియల్ చెప్పటం, చీకాకుతో ఎజినీ తిరస్కరించటం జరిగాయి. ఆమె భర్త వెళ్ళి పోయాక మళ్లీ సమావేశాలు యథావిధిగానే కొనసాగుతున్నాయి. మొదట్లో డానియల్ సహాయం అవసరమైనా, ఆతరవాత, తమకు తామే కాలాన్ని నియమించుకొనేవారు. ఆవిడ ఇంకొకావిడని కూడా వెంట పెట్టుకొచ్చేది — రాచపీనుగ, కుల స్త్రీ తోడు లేకుండా వెళ్ళకూడదట.

ఒకసారి సంకేత సమయానికి మేకీని చూడాలని ఒక కుటుంబం ప్రత్యక్షమయింది. అందులో ఎజినీ కిచ్చి పెళ్ళి చేయాలనుకున్న పిల్ల కూడా ఉంది. అందుచేత ఇక ఆ సమయానికి ఇల్లు విడవటం అతని తరం కాలేదు. తొందరగా తెముల్చుకొని ఆకాశాన్నుంచి ఊడి పడ్డట్టు, ఆ సంకేత స్దలానికి ఎగిరిపడ్డాడు. కాని స్టెఫానిడా మాత్రం అక్కడలేదు. ఆ స్థలంలో చేతికందిన ప్రతీదీ — గురివెంద పొదల రెమ్మలూ, పలవలూ, గున్న గంగిరేణి చిగుళ్లూ — అన్నీ తుంపి పోగులు పెట్టబడ్డాయి. ఆమె చాలాసేపు ఎదురు చూసింది; విసిగిపోయింది; చివరికి కోపం వచ్చింది. దాని స్మృతినే అక్కడ విడిచి వెళ్ళిపోయింది. అతను కూడా గంటల కొద్దీ ఎదురు చూశాడు. ఆఖరికి డానియల్ దగ్గర కెళ్ళి రేపు రమ్మని కబురు చెప్పమన్నాడు. ఆ రేపు వచ్చింది; ఆవిడ కూడా వచ్చింది. కథ మామూలుగానే సాగింది.

ఈ విధంగా ఆ వేసంకాలం గడచిపోయింది. సమావేశాలన్నీ అడివిలోనే జరిగేవి. ఎప్పుడో ఒకసారి మాత్రమే, అదైనా వర్షంవల్ల, ఆ పక్క గుడిసెలో జరిగింది.

ఇలాంటి సంబంధాలకొక ప్రాముఖ్యం కూడా ఉంటుందని ఎజినీ ఎన్నడూ భావించలేదు. ఆవిడ ఆలోచనే రాలేదతనికి. ఆవిడకి డబ్బిచ్చేవాడు; అంతటితో ఆఖరు. ఈ సంగతి నలుగురు నోళ్లాపడ్డదనీ, ఆ పల్లె జనమంతా స్టెఫానిడా అదృష్టానికి అసూయపడుతున్నారనీ ఎజినీకి మొదట్లో తెలియలేదు. అలాంటిది జరిగి ఉంటుందని కూడా కనీసం అతను ఊహించలేదు. ఆమె అత్తమామలు ఆమెనుంచి డబ్బును గుంజి ఆవిణ్ణి ప్రోత్సహిస్తున్నారనిగాని, ఆమె దృష్టిలో జరుగుతున్న మహాపాపమంతా కుటుంబామోదంవల్లా, అర్థప్రభావంవల్లా కడిగి వేయబడుతున్నదని కూడా అతను గ్రహించలేదు. ఆమె అదృష్టానికి పదిమందీ అసూయపడుతున్నారంటే ఆమె మంచి పనిచేస్తున్నట్టే గదా.

‘ఇది నా ఆరోగ్యానికి అవసరమని గాని,’ ఎజినీ ఆలోచించుకొన్నాడు. ‘ఇది అంత సజావైన పని కాదు; ఎవరూ ఏమీ చెప్పకపోయినా, ప్రతి ఒక్కడికీ, పోనీ

చాలామందికి ఈ సంగతి తెలుసు. దీనితో కూడా వచ్చేతైనాతీకి తెలుసు. ఇక దానికే తెలిసినప్పుడు అది పదిమందికీ చెప్పకుండా ఉంటుందా? ఏమిటి చెయ్యడం? నా ప్రవర్తన బావుందటంలేదు,' ఎజినీ అనుకున్నాడు. 'అయితే ఏమి చెయ్యను? ఏమైనా ఇలా అట్టేకాలం జరగటానికి వీల్లేదు.'

పాపం, ఎక్కువగా ఎజినీని బాధించిన విషయం ఆమె భర్తసంగతే. ఎందుకో కాని ఆమె భర్త గిబ్బిలాయి అనీ, కనుక తన ప్రవర్తన సరియైనదేననీ అనిపించింది. తీరా ఆమె భర్తని చూశాక అతని ఆకారం ఎజినీని ఆశ్చర్య చకితుణ్ని చేసింది. చక్కని వెనుపట్టీ, అందమైన విగ్రహం. బట్టలుకూడా మంచివే వేసుకొన్నాడు. ఏ విధంగానూ తనకి తీసి కట్టుకాడు. కాక పోగా అతనే మేలేమో అనిపించింది. ఆ తరవాత కలుసుకున్నప్పుడు తను ఆమె భర్తని చూశాననీ అతనంత అందగాడై నందుకు తనకు ఆశ్చర్య మయిందనీ ఆమెతో చెప్పాడు.

"ఈ ఊరుమొత్తంలో అలాంటి మనిషి ఇంకొకడులేడు." చాలా గర్వంగా చెప్పింది.

ఈ మాటకి ఎజినీ మరీ ఆశ్చర్య పోయాడు. ఆ తరువాత ఆ భర్త జ్ఞాపక మొచ్చినప్పుడల్లా నరకయాతన పడేవాడు. ఒకసారి డానియల్ తటస్థపడ్డాడు. ఏదో బాతాఖానీలోకి దింపి డానియల్లే నిర్మొహమాటంగా చెప్పేశాడు.

"నిన్ననే దాని మొగుడడిగాడు కదాండి: నా పెళ్ళాంతో చిన్న దొరగారు తిరుగుతున్నారంట నిజమేరా?' అని. నాకు తెలియదన్నాను. అని మళ్ళీ తమాషాకి, 'దయ్యంతో కంటే దొరగారితో నయం కదురా' అన్నాను."

"వాడేమన్నాడు?"

"వాడన్నాడండి: 'ఆగరా. అదే తెలుస్తుందిలే; అప్పుడే చెప్తాను దానిపని!"

'ఇంక మొగుడే ఇక్కడ కాపురం పెట్టేమాటయితే దాన్ని వొదులు కొంటాను,' అనుకున్నాడు ఎజినీ.

కాని భర్తమాత్రం యథాప్రకారం పట్నానికి వెళ్ళి పోవటం వల్ల ప్రస్తుతం వీరి కథకూడా నిర్విఘ్నంగా కొనసాగిపోతోంది.

'ఎప్పుడు అవసరమైతే అప్పుడే తెగతెంపులు చేసుకొంటాను. దానితో పీడ వదిలి పోతుంది,' అనుకున్నాడు.

ఆ వేసవిలో పనుల ఒత్తిడి ఉధృతంగా ఉన్న సమయంలో అంతపనీ జరుగుతుందనే అనుకున్నాడు. కొత్తగా దూశ్యశాల కట్టిస్తున్నాడు; అటు ఊడ్పులు; ఇటు ఇల్లు; ఒకవైపు అప్పులు తీర్చాలి: ఇంకొకవైపు బంజరు భూముల అమ్మకం___ ఈ అవసరాలన్నీ అతని మనస్సును పూర్తిగా ఆక్రమించి, అహర్నిశలూ అతన్ని వేధించసాగాయి. నిజమైన జీవితం అది. స్టెపానిడాతో అతని సంయోగం _ కనీసం

సంబంధమనైనా అనటానికి అతని కిష్టంకాలేదు — అతను కాంక్షించే అవకాశం కూడా లేదు. అతనిలో ఆ కోరిక రేకెత్తిందంటే, దాని ఉధృతం ఇకదేన్నీ ఆలోచించనీయదనేమాట సత్యమే. ఆ సమయం కూడా దగ్గిర కొచ్చింది. మామూలుగా సమావేశం ఏర్పాటయింది. ఆ తరవాత ఒక వారమో నెలో ఆమె జ్ఞాపకమే రాలేదు.

వానాకాలం వచ్చింది. తరుచుగా పట్నం వస్తూపోతూండటంలో ఆనీ కుటుంబంతో పరిచయ మేర్పడింది. వారి అమ్మాయి అప్పుడప్పుడే హైస్కూలు చదువు పూర్తి చేసింది. ఎజినీ తన తల్లి మేరీకి కడుపు చెరువయ్యేటట్టుగా 'నన్ను తాను చులకన చేసుకొని,' [అతని తల్లి అలాగే అంది.] ఆ హైస్కూలు పిల్ల లీజాను ప్రేమించి, పెళ్ళి స్థిరపరుచుకున్నాడు.

అప్పట్నుంచీ స్టెపానిడాతో ఆట కట్టయింది.

* * * * *

ఎజినీ, లీజానే ఎందుకు ప్రేమించాలి? అది చాలా తెలివి తక్కువ ప్రశ్న. ఫలానావాడు ఈ పిల్లనే ఎందుకు ఎన్నుకున్నాడు, ఆ పిల్లను ఎందుకు ఎన్నుకోలేదు అనే చచ్చు సందేహానికి ఎవరూ జవాబు చెప్పలేరు. దానికెన్నో కారణాలుంటాయి — సహేతుకమైనవీ అహేతుకమైనవి కూడా. తాను మునిగింది గంగ తాను వలచింది రంభ అనే సామెత ఉండనే ఉంది. అదికాక, తన తల్లి కాంక్షించినంత గొప్ప ఆస్తిపరురాలు కాకపోవటం ఒకటీ; రెండు ఆమె తన తల్లి దగ్గిర పిల్లిలా ఉండే శోచనీయ స్థితి ఒకటీ. మూడు; భార్యా రూపవతీ శత్రుః అన్నట్టు పదిమందినీ ఆకర్షించి ఆకట్టుకోగలిగిన అందం లేకపోవటం ఒకటీ; అయినా అంత అందవికారి కాకపోవటం ఒకటీ; ఇక అన్నింటికన్నా ముఖ్య కారణమేమిటంటే తీరాతనూ పెళ్ళికిదిగే సరికి ఆమెతో స్నేహం ఏర్పడటమే. తను పెళ్లి చేసుకోబోతున్నాడు కనుక ఆమెను ప్రేమించాడు.

మొదట్లో లీజా ఎజినీకి కేవలం చలాకీ పిల్లగానే కనిపించింది. అది చూసి అతను ఆమెను పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకోగానే అతనిలో ఆమెమీద అభిమానం కూడా పుట్టింది. తరువాత అతను అదే ప్రేమంటే అనుకున్నాడు.

లీజా ఎత్తుగా, పొడుగ్గా, సన్నగా ఉంటుంది. ఆమె ముఖం, ముక్కు (కిందకి సూదిగా వంగినది) వేళ్ళూ, పాదాలూ — ఆమె అవయవాలన్నీ పొడుగే. పచ్చని బంగారం రంగులో లేత నీలం కలిపిన శరీరచ్ఛాయ. పొడుగైన, మెత్తని ఉంగరాల జుత్తు; అందమైన కళ్ళు, స్పష్టమై, సూదుల్లా గుచ్చుకొనే కళ్ళు. ముఖ్యంగా ఆకళ్ళు ఎజినీని ఆకర్షించాయి. ఇంక లీజాను గురించిన ఆలోచన వచ్చినప్పుడల్లా అందమైన ఆమెకళ్ళు, స్పష్టమైన ఆమెకళ్లు, సూదుల్లా గుచ్చుకొనే ఆమె కళ్లు జ్ఞాపక మొచ్చేవి.

ఆమె భౌతిక రూపం అలాంటిది. ఆమె అంతర్యమెట్లాంటిదో అతనికి తెలియదు. ఇక అతనికి తెలిసిందల్లా ఆ కళ్లే. అతను తెలుసుకోదలచిందల్లా ఆ కళ్లే చెప్తున్నాయా అనిపించేది. ఆ కళ్లు చెప్పేకథ ఏమిటంటే;

హైస్కూల్లో ఉండగానే—అప్పటికి ఆమె వయస్సు పదిహేను—ఆమె చూసిన ప్రతీ అందగాడి చేతా ఆకర్షింపబడి ప్రేమలో పడేది. ఆ ప్రేమ ఉధృతంలో పరితపిస్తున్నప్పుడు మాత్రమే ఆమె తన్మయం చెందేది. హైస్కూలు విడిచాక కూడా అలాగే ఆమె చూసిన అందగాళ్ళందర్నీ ప్రేమించడం మొదలుపెట్టేది. అలాగే ఎజినీ పరిచయం కలిగాక అతన్ని కూడా ప్రేమించటం మొదలెట్టింది. ఆ ప్రేమించడంలోని అనుభవమే ఆమె కళ్ళల్లో మెరుపు ముద్దలై ఎజినీకి కనిపించిన విచిత్రమైన భావాన్ని ద్యోతకం చేసింది. ఆ శీతాకాలంలో ఇద్దరు యువకుల్ని ఒక్కసారి ప్రేమించింది. వాళ్లు గదిలో అడుగు పెడితేచాలు — లేదా వాళ్ళ పేరు చెపితేచాలు ముఖం సిగ్గుతో ఎర్రబడేది; శరీరం స్వాధీనం తప్పిపోయేది. ఆ తరువాత ఆవిడ తల్లి ఇంకో కాయన ఎవరో (ఎజినీ) ఈమెకోసం పడి ఛస్తున్నారని చెప్పగానే, అతని మీద ప్రేమ హెచ్చయి, చివరికి అంతకి పూర్వం తాను ప్రేమించిన ఇద్దర్నీ పూర్తిగా మరిచిపోయింది. ఇక ఈ కొత్తాయన కూడా నాలుగు రోజులపాటు విందులకీ వినోదాలకీ ఈమె దగ్గరికి వస్తూ, ఈమె కేసి ప్రేమ చూపులు చూస్తూ, ఈమె ప్రేమను పరీక్షించాలని ప్రయత్నించిన కొద్దీ, ఆమె ప్రేమ గట్టు తెంచుకొని అతనికోసం ఉరక వేసేది. నిద్దట్లో కలవస్తే ఆ కొత్తాయనే. తలుపులు బిగించిన చీకట్లో మంచంమీద పడుకుని చూస్తే ఎదురుగా ఆ కొత్తాయనే కనిపించేవాడు. ఆమె ప్రేమికులై ఒకప్పుడు తారాపథం పొందిన అనంత జనాభా యావత్తూ నామరూపాలు లేకుండా పోయేవి. ఇక పెళ్ళి మాటలు రాగానే, ముహూర్త నిశ్చయం కాగానే, వాళ్ళిద్దరూ ఒకళ్ల నొకళ్లు అదుముకొని ముద్దు పెట్టుకోగానే — ఇంక ఆమెకి అతని ఆలోచనలు తప్ప మరో ధ్యాసే లేదు, అతన్ని ప్రేమించాలనీ, అతనిచే ప్రేమింపబడాలనీ, అనునిత్యం అతనిలో లీనమైపోయి ఉండాలనీ తప్ప ఆమెను వేరే ఏ కోరికా కలగలేదు. అతన్ని పొందిన గర్వం ఆమెకి; అతని పేరే ఆమె నరాల ఉద్రేకం; ఆమె, ఆమె ప్రేమ — అన్నీ అతని ప్రేమలో కరిగి లీనమైపొయ్యాయి.

ఆమె గురించి తెలుసుకున్న కొద్దీ ఆమెను మరింత ఎక్కువగా ఆరాధించ ప్రారంభించాడు. అట్లాంటి ప్రియురాలు అతనికి దొరుకుతుందని అతను కలలోనైనా భావించలేదు. అదే అతని ప్రేమని మరీ పెంపొందించింది.

* * * * *

వసంతం వచ్చింది. మళ్ళీ తన ఎస్టేటు వ్యవహారాలు చూసుకోవాలి, కొన్ని అత్యవసరమైన సూచనలు కూడా చెయ్యాలి. తన పెళ్ళికోసం ఇల్లు మరమ్మత్తులు చేయించాలి. అందుకని ఇంటికి వెళ్ళాడు.

మేరీ తన కొడుకు ఎన్నికతో తృప్తి పడలేక పోయింది. దానికి కారణం తాను ఆశించినంత గొప్ప పెళ్ళికూతురు కానందుకే కాదు. తనకు కాబోయే వియ్యపురాలు వార్వారా అంటే ఆమెకి ఇష్టంలేక పోవటమే. ఆమె స్వభావం మంచిదో చెడ్డదో ఆమెకు తెలియదు. ఆమె నిర్ణయించనూలేదు. అయితే ఆమె పెద్దవంశంలోది కాదనీ, రాచరికం ఆమెలో లేదనీ ఆమెని తొలిసారి చూసినప్పుడే గ్రహించింది. అదే ఆమెను ఎక్కువగా బాధించింది. ఆమె వంశాన్ని బట్టి ఆమె విలువని నిర్ణయించటానికి పూనుకున్నది కనుక ఆమె మరీబాధపడింది. తనలా బాధ పడుతున్నట్టు ఎజినీ గ్రహించాడని కూడా తెలుసుకొంది. ఈ కారణం చేత ఎజినీ భవిష్యత్తులో ఇంకా ఎక్కువగా బాధపడతాడని కూడా ఆమె అనుకుంది. ఏమైనా ఆ పిల్ల మాత్రం ఆమెకి నచ్చింది. ముఖ్యంగా ఆమెకు నచ్చటానికి కారణం, ఎజినీకి నచ్చటమే. ఎవరైనా ఆమెను ప్రేమించక తప్పదు. మేరీ కూడా ఆత్మశుద్ధిగా అందుకు సిద్ధపడింది.

తన తల్లి సంతుష్టి పడిందనీ, ఈ విషయంలో చాలా ఉత్సాహంగా ఉందనీ ఎజినీ గ్రహించాడు. ఇంటి విషయాలన్నీ ఆమె స్వయంగా చక్కబెట్టుకొంటూ, కోడలు గుమ్మంలో కుడికాలు మోపగానే తాను వెళ్ళిపోవాలని మూటాముల్లె ఆయత్తం చేసుకొంటోంది. అయినా కొన్నాళ్ళపాటు ఉంటేనేగాని వీల్లేదని ఎజినీ బలవంతం చేశాడు; కాని భవిష్యత్తు మాత్రం అనిర్దిష్టంగానే ఉండిపోయింది.

మధ్యాహ్నం టీ తయారవుతోంది. ఎజినీ తల్లి దగ్గరే కూర్చొని ఆమెకు సాయపడుతున్నాడు. అతి ముఖ్యమైన కబుర్లన్నీ ఇలాంటి సమయంలోనే చెప్పుకోవటం వాళ్ళకి అలవాటు. డికాక్షన్ వడబోస్తూ అతని ముఖం కేసి చూసి, కొంచెం సందేహించి, తల్లి అందుకొంది.

“బాబూ, నీతో ఒకటి చెప్పాలనుకున్నాను — నిజం నాకు తెలియదనుకో; అయినా సాధారణ విషయం కనక చెప్పాలని — బ్రహ్మచర్యం రోజుల్లో నువ్వెలా గడిపినా కాని, ఇక భవిష్యత్తులో నిన్నుగాని నీభార్యనిగానీ ఏదీ కలత పెట్టకుండా ఉండటంకోసం, అపూర్వ సంబంధాల నన్నింటినీ తెగతెంపులు చేసుకోవటం మంచిది నాయనా. దేవుడు మేలు చెయ్యాలిగాని. తెలిసిందా?”

తన తల్లి తనకు స్టెపానిడాతో ఉన్న సంబంధాల ప్రసక్తి తెస్తున్నదని ఎజినీ గ్రహించాడు. వాటికి అనవసరంగా ఆమె ఎక్కువ ప్రాముఖ్యతనిస్తోందని భావించాడు. జీవితంలో ఒంటరితనం కలిగించిన చాదస్తమే దానికి కారణ మనుకున్నాడు. ఇంతకీ స్టెపానిడాతో అతని సంబంధాలు గత శరదృతువులోనే తెగిపొయ్యాయి. ఎజినీ సిగ్గుపడ్డాడు. విసుగువల్ల కాని, అవమానం చేతగాని కాదు. అంత మంచిమేరీ అనవసర విషయాలలో — ప్రేమ వల్లనేకానీ, అయినా అనవసరం కదా — తనకు అర్థం కాని, కాలేని విషయాలలో కలుగ జేసుకొంటున్నందుకు అతని ముఖం ఎర్ర

బడింది. తను దాచవలసిన దేదీలేదనీ, తన వివాహానికి ఏదీ ఆటంకం కాకుండా తాను జాగ్రత్తగా అన్నిటినీ చక్కబెట్టుకొన్నాననీ తల్లికి చెప్పి సమాధాన పరిచాడు.

"మంచిపని చేశావుబాబూ. కాని... వినుకోకేం నాయనా!" ఏదో చెప్ప పోయి చెప్పలేక తికమకపడి ఆగిపోయింది.

ఆమె చెప్పదలుచుకున్నది చెప్పలేదనీ అది ఇంకా పూర్తికాలేదనీ ఎజినీ గ్రహించాడు. అది త్వరలోనే, మళ్ళీ తల్లి ప్రారంభించగానే, ధృవపడిందికూడా. అతను ఊళ్ళో లేనప్పుడు స్టెఫానిడా మామగారైన ముసలి మైఖేల్ వచ్చి ఆమెను వెంటబెట్టుకు వెళ్ళి స్టెఫానిడా బిడ్డకు పురిటినీళ్ళు చల్లించి, ఆ బిడ్డకు జ్ఞానమాత * గా ఆమెచే ఎలా ప్రమాణం స్వీకరింప జేశాడో ఆమె విశదపరిచింది.

ఎజినీముఖం మళ్ళీ ఎర్రబడింది; ఈసారి విసుగుతోగాని, అవమానంతోగాని కాదు. ఇంకా ఎట్లాంటిమాటలు తను వినవలసివస్తుందో అనే లజ్జ. అయితే అతనినిర్ణయాలకీ అతనిలజ్జకీ ఏమీ సంబంధంలేదు. అయినా అతను అనుకున్నంతా అయింది. ఏదో లోకాభిరామాయణం చెపుతూన్నట్టు — రాబోయే యుద్ధానికి ఒక పెద్ద తార్కాణంగా—అంతటా మొగపిల్లలే పుడుతున్నారని తల్లి చెప్పింది. ఏదో తమకు పట్టని సంగతులేవో యథాలాపంగా అనుకుంటూన్నట్టుండాలని మేరీ యెంతో ప్రయత్నించిందిగాని, తీరా ఆమె కొడుకు ముఖంలో కొచ్చిన రంగును చూసేసరికి ఆమెకే అవమానమయింది. కళ్ళజోడు మాటిమాటికీ తీస్తాడు. దానిచెవికాడల్ని టపీటపీమని నొక్కుతాడు. వెంటనే మళ్ళీ కళ్ళకుపెట్టుకుంటాడు. వొణుకుతున్న చేతుల్తో సిగరెట్ ముట్టించబోతాడు. ఆమె మౌనం వహించింది. అతను కూడా మౌనం వహించాడు. ఆ ఘనీభూత మౌనం పగిలిపోతుందేమోనని అతని భయం. వాళ్ళిద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకున్నట్టుగా ఈసారి అర్థం చేసుకొన్నారు.

"మీతాతగారి కాలంలోలా ధర్మం నాలుగు పాదాల నడవవలసిందేకాని గ్రామంలో పక్షపాతం ఉండ కూడదు."

"అమ్మా," ఎజినీ అకస్మాత్తుగా అన్నాడు, "నువ్విలా ఎందుకంటున్నావో నాకు తెలుసు నమ్మా. నీ మనస్సు పాడు చేసుకోకు. నాభావి సంసార జీవితం నాకెంత పవిత్రమైనదో నేను వేరే చెప్పనక్కర్లేదు. నా ప్రాణాలున్నంత కాలం నేను దానిని అతిక్రమించను. ఇక నా బ్రహ్మచర్య జీవితంలో జరిగినదంతా ఆఖరయిపోయింది. నేనెవర్నీ కలియనూలేదు; నామీద ఎవరికీ అలాంటి అధికారమూలేదు."

"చాలా సంతోషం నాయనా. నీవెంత ఉన్నతాశయాలో నాకు తెలుసు."

ఎజినీ తన తల్లిమాటలను, తనకు రుణ పడ్డ అభినందనగా అంగీకరించి ఊరుకున్నాడు.

---

* ఆ శిశువుపేర మతాన్ని స్వీకరించి, ఆ శిశువు సుశిక్షణకు పూచీపడే సంరక్షకురాలు.

ఆపుర్నాడు తన క్రొత్త పెళ్ళికూతురున్న గురించీ, ఒక్కొక్కసారి ఏ ప్రపంచంలోని అన్నింటిన్నీ గురించీ ఆలోచించుకొంటూ బస్తీకి బయలుదేరాడు. చర్చిదాకా వెళ్ళేటప్పటికి చర్చినుంచి జనం రావటం కనిపించింది. కొంతమంది యువకులు, వాళ్ళ వెనకనే యువతులు ఆ వెనకాల ఇద్దరు స్త్రీలు ఎదురయ్యారు. అందులో ఒకామె వయోవృద్ధ. రెండో ఆమెని తానెక్కడో చూసినట్టు. చక్కగా సింగారించుకొంది. చేతుల్లో శిశువుతో చాలా తేలిగ్గా కీవిగానడుస్తోంది. వాళ్లుకూడా తనకు దగ్గిరపడ్డారు. ఆ ముసలావిడ పక్కకి వత్తిగిల్లి వంగి నమస్కరించింది. బిడ్డనెత్తుకున్న ఆవిడ తలవంచి, తన నవ్వుతున్న కళ్లతో పలకరించింది.

అవును, ఆవిడే; అనుమానంలేదు. కాని, గతజల సేతుబంధనం. ఆవిడకేసి చూడటంకూడా అనవసరమే. 'ఆ బిడ్డ నాదేకావచ్చు,' మనస్సులో మెరిసిన ఒక ఆలోచన. ఆ ఆలోచనకి అతనికే సిగ్గయింది. అదెల్లా? ఆమె భర్త ఉన్నాడు. ఆభర్తని ఆమె కలుసుకొనేది. ఆవిషయాన్ని తను అంతగా పట్టించుకోలేదుకూడా. తనకు కావలసింది తన ఆరోగ్యం — ఆమెకు డబ్బు ఇచ్చాడు. ఇంక బాధపడటందేనికి! మళ్లీ తామిద్దరూ కలుస్తారన్న సమస్య, ఇదివరకులేదు; ఇకముందు వుండదు; అలా ఉండటానికి వీల్లేదు. అందుకని తన అంతరాత్మగొంతుకను పిసికి చంపివేశాడని కాదు. అసలు ఆ అంతరాత్మ ఈ విషయంలో ఏమీ కలగజేసుకోలేదు. తన తల్లితో ఆవేళ ఆ చర్చవచ్చాక, మళ్లీ ఈవేళ ఇలా తలవని తలంపుగా ఈమెను కలుసుకొనేలోగా— ఆమె ఆలోచనే అతనికి రాలేదు. మళ్లీ కలుసుకోనన్నా లేదు.

ఈస్టర్ వెళ్లిన మరుసటి వారం బస్తీలో ఎజినీ వివాహమయిపోయింది. పెళ్లి కాగానే భార్యను తీసుకొని ఉన్న ఊరు వచ్చేశాడు. ఆ ఇల్లు ఆదంపతులకు అనుగుణ్యంగా ఉందికూడా. మేరీ వెళ్లిపోతానంది; కాని, ఎజినీ ఆమెను వెళ్లవద్దని బ్రతిమాలాడు. లీజాకూడా వెళ్లవద్దని ప్రార్థించింది. అందుకని ఆమె ఆవెనక విడిగా ఉన్న ఇంట్లోకి తరలి పోయింది.

ఈ విధంగా ఎజినీకి కొత్త జీవితం ప్రారంభమైంది!

* * * * * * * *

అతని వివాహమయిన మొదటి సంవత్సరం చాలా గడ్డుదనే చెప్పాలి. పెళ్లి ముందురోజుల్లో ప్రేమలోపడి అతను వాయిదా వేసిన వ్యవహారాలన్నీ, పెళ్ళికాగానే, ఒక్కసారి మీద పడ్డాయి.

బాకీలబారి నుంచి బైటపడటం బొత్తిగా అసాధ్యం. పొరుగూరి భూముల్ని తుడిచిపెట్టి ముఖ్యమైన కొన్ని బాకీల్ని రద్దుచేసినా మిగతావి అలానే ఉన్నాయి. అతని దగ్గర డబ్బు మాత్రం లేదు. స్వంత వ్యవసాయం బాగానే పండింది; శిస్తులు కూడా అపూర్వంగానే వసూలయ్యాయి. కాని, తన అన్నగారికి శిస్తు [మనోవర్తి] చెల్లించాడు. తను పెళ్ళిచేసుకొన్నాడు. అందుచేత చేతిలో చిల్లిగవ్వ మిగలలేదు. ఇక ఫ్యాక్టరీని కూడా మూయక తప్పని పరిస్థితి వచ్చేసింది. ఇలాంటి చిక్కులనుంచి తప్పుకోడానికి కూడా ఒకేఒక్క మార్గముంది. అదే తన భార్యసొమ్ము. లీజాకూడా తన భర్త స్థితిని గ్రహించి, వాడుకోమని వత్తిడి చేయసాగింది. ఎజినీ ఒప్పుకొన్నాడు. తన ఎస్టేటులోచెరి సగం తణఖా పుచ్చుకొనే షరతుమీద అయితే ఒప్పుకొన్నాడు. అలా ఇచ్చాడుకూడా. ఈపనికి తన భార్య చాలా బాధపడింది. తను అలా చేస్తే నిజానికి తన భార్యకోసం కానేకాదు; తన అత్తగార్ని ఉపశమింప జేయడానికే

ఆ మొదటి సంవత్సరం — ఈ వ్యవహారాలన్నీ జయాపజయాల ఒడిదుడుకుల్లో పడి నిర్మలమైన ఎజినీ జీవితాన్ని విషమయం చేశాయి. దానికి తోడు భార్య అనారోగ్యం ఒకటి. పెళ్లయిన ఏడు నెలలకి లీజానిశనిగ్రహం పట్టుకొందనే అనాలి. ఒకసారి బస్తీనుంచి తన భర్త వస్తున్నాడని తెలిసి, ఉత్సాహంతో బండి కట్టించుకొని స్టేషన్‌కి బయలుదేరింది. ఆ గుర్రం — ఎప్పుడూ చెప్పినట్టు వినేదల్లా — ఆవేళ కొంచెం పేచీపెట్టింది. రోడ్డు పక్క సోలోపులోకి లాగేస్తుందేమోనన్న భయంతో కంగారుపడి బండిమీంచి కిందికి లీజా దూకేసింది. నిజానికి కొంత అదృష్టవంతురాలనే చెప్పాలి — అసలు చక్రంక్రింద పడవలసిన మనిషి — ఆమె గర్భిణీ స్త్రీ కూడా. ఆరాత్రే ఆమెకు నొప్పులు ఎక్కువై గర్భస్రావం జరిగింది. తాను ఆశించిన సంతాన నష్టమూ, తన భార్య అనారోగ్యమూ, తన వ్యవహారాల చిక్కులూ, అన్నిటికన్నా తన అత్తగారి ఆర్భాటమూ (లీజాజబ్బుపడగానే ఆమె తల్లి పరుగెత్తుకొచ్చింది) ఇవన్నీ కలిసి ఎజినీకి ఆ సంవత్సరాన్ని బొత్తిగా దుర్భరం చేశాయి.

ఈ గడ్డుపరిస్థితుల్ని తట్టుకోలేక పోయినప్పటికీ, ఆ సంవత్సరాంతానికి ఎలాగో ఎజినీ ఒక ఒడ్డున పడ్డాడు. తన చితికిపోయిన అదృష్టాన్ని పునఃప్రతిష్ఠించుకోవటంలోనూ, తన తాతగారి ఫాయీకి తన జీవిత క్రమాన్ని సరిదిద్దుకోవటంలోనూ మొత్తానికి ఎలా అయితేనేమి విజయవంతుడయ్యాడు. రుణాలకోసం ఆస్తినంతా అయినకాడికి తెగనమ్ముకోవలసిన స్థితి తప్పింది. ముఖ్యమైన స్థిరాస్థి, తన భార్య పేర సంక్రమించినప్పటికీ, మిగిలిపోయింది. ఇంక పంటలు బాగా పండి, ధరలు పడిపోకుండా ఉంటే మీదటికి తన సొమ్మెవడు తినను! అదొకటి.

ఇంకొకటి ఏమిటంటే, తను తన భార్యనుంచి ఎంత ఎక్కువ ఆశించినప్పటికీ, తను ఆశించిన దానికంటే ఎక్కువే పొందగలిగాడు. అంత ఎక్కువ ఆనందాన్ని పుంజుకోగలనని అతను ఆశించలేదుకూడా. ఇక ప్రణయకలహాలు — అతనెంత తీసుకురావాలని ప్రయత్నించినా — రానూలేదు; వచ్చినా నిలబడనూలేదు. దీనివల్ల అతను ఎంతో ఆనందంగా హాయిగా ఉండటమే కాకుండా బతకటం చాలా తెలికైన దనే అమూల్య నిర్ణయానికి రాగలిగాడు. జీవితం ఇంత హాయిగా ఎందుకుండాలో అతనికి తెలియదు; అయినా అది అతనికి హాయిగానే ఉంది.

ఇలా ఉండటానికి కూడా కారణముంది; పెళ్ళయిన వెంటనే, ఈ ప్రపంచంలోని ప్రతి ఒక్కడికన్నా కూడా తనభర్త ఉత్తముడని లీజా భావించ నారంభించింది. చాలా తెలివైనవాడనీ, పూర్తిగా పవిత్రుడనీ, అందరికన్నా ఉన్నతుడనీ ఆమె నిర్ణయించుకొని — అతనికై తన సర్వస్వాన్నీ అర్పించటం, అతని ఆనందమే పరమావధిగా తలపోయటం సాగించింది. అందరికీ అతని యందు అలాంటి భావం కలగటం అసాధ్యం కనుక, లీజాయే తన శక్తికొద్దీ అతని సేవలో నిమగ్న మయ్యేది. అతనికే వేళ ఏమేమి అవసరమో ఊహించి తెలుసుకోవటంలో తన మేధాశక్తినంతా వినియోగించి— అది ఎట్లాంటిదైనా, ఎంత కష్టసాధ్యమైనదైనా దానిని సాధించి తీరేది.

ఒక స్త్రీతో మాట్లాడటమే మనకి ఆనందంగా ఉంటుంది; వస్తుతః లీజా అలాంటి స్త్రీ. ఆమె అమూల్య ప్రేమకొక నమస్కారం పెట్టాలి. నిజంగా ఆమె తన భర్త హృదయాన్ని సాధించుకోగలిగింది. అతని అనుభూతిలోని ప్రతి చిన్న మార్పునీ, ప్రతి చిన్న పరిస్థితినీ ఆమె అనుగతం చేసుకొనేది — అతని అంతర్యం అతని కంటే ఆమెకే బాగా అర్థమయ్యేది. వాటికనుగుణంగానే ఆమె ప్రవర్తించేది. కనుక అతని అనుభూతుల్ని గాయపరచవలసిన అవసరమే ఆమెకు కలగలేదు. పోగా అతని దుఃఖాల్ని కొంచె పరిచి అతని సుఖాల్ని పెంపొందించేది. అతని అనుభూతుల్నే కాక అతని ఆనందాల్ని కూడా ఆమె అర్థంచేసుకొనేది. వ్యవసాయానికీ, ఫ్యాక్టరీకి, రుణగ్రస్తులకీ సంబంధించిన గొడవలు — అవి ఆమెకెంత కొత్తవైనా—ఆమె చటుక్కున అర్థం చేసుకోగలిగేది. ఆ నైపుణ్యంవల్ల, వాటి ప్రసంగంలోనే కాకుండా, వాటి తీర్పుకుకూడా ఆమె అమూల్య సలహాలనిచ్చేది. ఆ సంగతి అతను కూడా అంటూండేవాడు. అతని వ్యవహారాల్ని, అతని మనుష్యుల్ని, ప్రపంచంలో అతనికి సంబంధించిన ప్రతీదాన్నీ అతని కళ్ళతోటే చూడటం నేర్చుకోగలిగింది. ఆమెకు తనతల్లిమీద ప్రేమే,

కాని అతనికి తన అత్తగారంటే అయిష్టం కనుక — తనతల్లి తను సంసార జీవితంలో కలుగజేసుకొన్నప్పుడల్లా ఆమె భర్తతరఫునే నిలబడి పోరాడేది. అప్పుడావిణ్ణి శాంత పరచటానికి మళ్ళీ భర్తే పూనుకోవలసి వచ్చేది.

దీని కంతకీ తోడు ఆమెలో గొప్ప అభిరుచీ, నైపుణ్యాం, వ్యవహార దక్షత కూడా ఉన్నాయి. ఆమె ఏ పనిచేసినా చేస్తున్నట్టే ఉండేది కాదు. ఫలితాన్ని బట్టి మాత్రమే ఆమె చేసిన పనిని గుర్తించాలి. శుభ్రతకీ, క్రమానికీ, అందానికీ ఆమెదే పేరు. తన భర్త జీవితాదర్శం ఎందులో ఉన్నదో ఆమె తేలికగా అవగతం చేసుకొంది. గృహకృత్య నిర్వహణలోనే అతని ఆదర్శాన్ని సాధించే కంకణం కట్టుకొంది. ఆ దీక్షలో ఆమె ఎన్నడూ పొరబడలేదు. పిల్లలులేక పోవటం ఒక్కటే కొరత. అయితే ఆ ఆశకూడా లేకపోలేదు. గత వర్షాకాలంలో ఒక డాక్టర్ చే తన ఆరోగ్యం పరీక్ష చేయించుకొంది; ఆమెలో ఏవిధా లోపంలేదనికూడా తెలుసుకొంది.

చివరకి ఆ కోరిక కూడా నెరవేరింది. మళ్ళీ సంవత్సరాదినాటికి ఆమె గర్భవతి అయింది.

అయితే వారి సంసారసౌఖ్యాన్ని—విషపూరితం చేసిందనటానికి బదులు భయపెట్టిన దంటే చాలు — భయపెట్టిన సంగతి కూడా లేకపోలేదు. అదే ఆమెలోని అసూయ. ఆ అసూయని ఆమె ప్రదర్శించక ఎంత దాచుకున్నా, అది ఆమెను తరుచు బాధించసాగింది. ఎజినీ ఇంకో స్త్రీని ప్రేమిస్తాడనే కాదు — ఇంకో స్త్రీ అతనికి తగ్గది ఉన్నదని ఆమెకు నమ్మకమే లేదు; (తనయినా అందుకు తగుతుందా లేదా అని ఆమె ఎన్నడూ ఆలోచించలేదు.) — అయినా ఏ స్త్రీ అయినా అతన్ని ప్రేమించ సాహసిస్తుందేమోనని ఆమె భయం.

*    *    *    *    *    *    *    *

ఇదీ వాళ్ల జీవితక్రమం! అతను ఉదయమే లేచేవాడు; అతనికదే అలవాటు. లేచి ఫ్యాక్టరీకో, పొలాలకో, తప్పితే మాళ్ళశాలకో వెళ్లేవాడు. పదిగంటలయ్యేసరికి వచ్చేవాడు, మేరీ, లీజా, ఇంకో మామయ్యా, ఎజినీ— నల్గురూ వరండాలో కూర్చొని కాఫీ త్రాగేవారు. తరుచు వెష్టపుట్టించే బాతాఖానీ పూర్తికాగానే ఎవరి పనుల్లో వారు నిమగ్నమయ్యేవారు. మళ్లీ పునస్సమాగమం మధ్యాహ్న భోజనకాలానికే. మధ్యాహ్నం రెండుగంటలకల్లా భోజనాలయి పోయేవి సాయంత్రం అతను ఆఫీసు నుంచి రాగానే టీ త్రాగి తరుచు ఏదో పుస్తకం పైకి చదువుతూండేవాడు; ఆమె పని చేసుకొంటూనే వినేది ఇక స్నేహితులెవరైనా వస్తే ఆ పూటకి బాతాఖానీయే. ఏ వ్యాపారానికో దూరంగా వెడితే మాత్రం అతను భార్యకు ప్రతిరోజూ ఉత్తరాలు వ్రాసేవాడు; అందుకు నేవాడుకూడా. ఒకప్పుడు ఆవిడకూడా బైలుదేరేది; అప్పట్లో వాళ్ల సంతోషానికి పరిమితమే ఉండేది కాదు. ఇక అతని పుట్టినరోజునా, ఇతర పండుగల

రోజుల్లోనూ వచ్చిన స్నేహితులందరికీ ఆమె ఎలా సర్దిచెప్పేదో అతనికే ఆశ్చర్యం వేసేది. బంధువులలోనూ ఆమె తెచ్చుకున్న పేరు, ఆమెకున్న గౌరవం — తెలుసు కొని విని, — ఆమెమీద ప్రేమ ఇంకా ఎక్కువై పంచప్రాణాలూ ఆమెలోనే దాచుకో సాగాడు.

అంతా బాగానే జరిగింది. మొదట్లో కొంత భయపెట్టినా ఎలాగో గర్భిణీ నిలిచింది. ఇంక పుట్టబోయే బిడ్డని ఎట్లా పెంచాలా అన్నదే వాళ్ల సమస్య. ఆచర్చల తోనే వాళ్ళ కాలక్షేపం. ఎలా చదివించాలి, ఎలాంటి ఏర్పాట్లు చేయాలి — మొదలైన సమస్యలన్నిటికీ ఎజెనీయే తన నిర్ణయాలిచ్చాడు. ఇక ఆవిడ కోరిక కూడా అతని నిర్ణయాలకి తలఒగ్గి సక్రమంగా అసలు జరపటమే. ఎజెనీ వైద్యగ్రంథాలన్నీ తిరగ వేయటం ప్రారంభించాడు. వాటి ప్రకారం శాస్త్రీయంగా తమ బిడ్డని పెంచాలని అతని ఆశ. పాపం ఆవిడ అన్నిటికీ సిద్ధపడి ఆ ప్రకారం ఆయత్తమయ్యేది. చిన్న చిన్న బొంతలు, చెవులకు చలిగాలి తగలకుండా ఊలు టోపీలు, దోమతెరలు, ఉయ్యాలలు తయారు చేస్తూ కూర్చునేది. ఈ విధంగా, వారి వివాహమయిన రెండవ సంవత్సరంకూడా, మళ్లీ వసంతందాకా సాగిపోయింది.

* * * * * * * *

ఆ రోజు ఆదివారం. ఏదో పండుగరోజు. లీజాకు అయిదవ నెల. ఎంత జాగ్రత్తగా ఉన్నా కొంత చలాకీగా కొంత హుషారుగా ఉండేది. అతని తల్లీ అత్తగారూ కూడా ఆ ఇంట్లోనే ఉండేవారు. ఆమె సంరక్షణ బాధ్యతలన్నీ వాళ్ల భుజాలమీదకి తీసుకొని ఆత్రంతో ప్రతీ చిన్న విషయానికీ ఆమెను ఆడిపోసేవారు. ఆవిడ మనస్సు నొచ్చుకున్నా ఊరుకునేవారు కాదు. అతను చూస్తే చెరుకుతోట పనిలో నిమగ్నమై పోయ్యాడు.

ఇంటికి వెల్లలు, ఎప్పుడో పెద్ద పండుక్కి అయ్యాయి ఇల్లు మకిలి పట్టిందని లీజా శుభ్రం చేయించాలని, ఉన్న నౌఖర్లకు తోడుగా ఇద్దరు ఆడకూలీల్ని పనిలో పెట్టింది. [illegible] ఉదయమే పనిలోకి వచ్చారు. వాళ్లిద్దరిలోనూ ఒకర్తె సైపానిడా. ఆ ఆఫీసు గుమస్తా ద్వారా ఈ ఇల్లు కడిగే పని సంపాదించి, బిడ్డణ్ణి చంకలో పెట్టుకుని పనిలోకొచ్చింది. కొత్త "అమ్మ"గారిని ఒకసారి చూడాలని దానికి సరదా. సైపానిడా ఇదివరకు లాగే, పొట్టచేతబట్టుకుని బ్రతుకుతోంది; ఆమె భర్త ఇంకా మాస్కోలోనే ఉన్నాడు. మొదట్లో ముసలిడానియల్ తోటీ [అడివిలో కలప నరుక్కుపోతూంటే ఒకసారి డానియల్ ఆమెని పట్టుకున్నాడు] ఆ తరవాత యజమానితోటీ, ఇప్పుడు ఆఫీసు గుమాస్తాతోటీ ఆమె సంబంధాలు పెట్టుకుంది. కనుక యజమాని అవసరం ఇప్పుడేమీ ఆమెకు లేదు. 'ఆయనకో పెళ్లాం ఉందిగా?' అనుకుంది. అయితే అవిణ్ణీ, ఆవిడ పద్ధతినీ ఒకసారి చూడటం మంచిది. జనం ఆమె గొప్పని ఎందుకలా చెప్పుకొంటారో!

ఎప్పుడో చర్చిదగ్గర తటస్థపడ్డ తర్వాత నేటివరకూ ఎజినీ స్టెఫానిజాని చూడలేదు. ఆవేళ ఉదయం అయిదు గంటలకే, చేలో ఎరువులు జల్లించటంకోసం బైలుదేరి ఎజినీ వెళ్లిపోయాడు. అప్పటికింకా ఆ ఇద్దరు స్త్రీలూ పనిలోకి రాలేదు.

పని సంతృప్తికరంగా సాగటంచూసి సంతోషంతో, తృప్తితో, ఆకలితో ఇంటికొచ్చాడు. గుర్రందిగి దానిని తోటమాలి కప్పగించాడు. మొక్కల్ని కొరడాతో కొట్టి ఇంట్లోకిపోతూ 'ఎరువులు న్యాయంచేస్తాయి' అనుకున్నాడు. ఎట్లాంటి, ఎవరికి అతను ఆలోచించనూలేదు; అతనికి తెలియనూ తెలియదు.

వాళ్లు తివాచీని గడ్డిలో దులుపుతున్నారు. ఇంట్లోని సామానంతా బైటకి తెచ్చేశారు.

'ఇదేమిట్రా బాబూ! ఈ ఇల్లుకడగడా లేమిటి?...లీజా బలేమనిషి ... ఎరువులు న్యాయం చేస్తాయి...బలేమనిషిలే లీజా...ఇల్లు చక్కదిద్దుకోవటం దానికే తెలియాలి.' తెల్లబట్టల్లో ఆమె నవ్వుతూన్న ముఖం అతనికళ్లకు కట్టింది. 'అన్నట్టు బూట్లు విప్పేసెయ్యాలి. లేకపోతే "ఎరువులు న్యాయంచేస్తాయి," అంటే ఎరువుల వాసన, ఇల్లాలు ఒకేస్థితిలో ఉన్నాయన్న మాట, "ఒకేసితిలో ఏమిటి?" ఏమిటా - 'ఆమె కడుపులో ఒక బుల్లి పాపాయి పెరుగుతోందిగా,' అనుకున్నాడు. 'అవును' ఎరువులు న్యాయంచేస్తాయి, ఆఆలోచనలకి నవ్వుకుంటూ తలుపుమీద చెయ్యివేసి పైకి లాగబోయాడు.

కాని, అతను లాగబోతుండగానే ఆ తలుపులు తమంతతామే తెరుచుకొన్నాయి. ఎగబోసి బట్టకట్టుకొని నెత్తిన మోపుపెట్టుకొని ఎవరో ఒక స్త్రీ తనకు ముఖాముఖీ ఎదురయింది. ఆ విణ్ణి పోనివ్వటానికని తాను పక్కకు ఒత్తిగిల్లాడు, అతనికి దారివ్వటానికని ఆమె పక్కకు ఒత్తిగిల్లి తన తడిచేతులతో పమిట సర్దుకుంది.

"పదపద, ముందునువ్వు పద, అందాకా..." ఎజినీ ఏదో అనబోయి, ఆమెను గుర్తుపట్టి, చటుక్కున ఆగిపోయాడు.

ఆమెనవ్వుతున్న కళ్లతో, చాలా సంతోషంగా చూసింది! మళ్ళీ పమిట సర్దుకుని వెళ్ళిపోయింది.

"నాన్సెన్స్... ఇంపాజిబుల్" అనుకున్నాడో అన్నాడో ఎజినీ; చెయ్యిమాత్రం ఒక ఈగని అదిలించినట్టు విసిరాడు. ఆమె దర్శనం అతనికి ఆనందాన్ని కలిగించలేదు. ఆవిణ్ణి ఇలాచూడటం అతన్ని బాధించింది; కాని ఆమె బలమైన శరీరంపై వ్రాలి అతని కళ్లు మరీబాధించసాగాయి. ఆమె చేతుల్నీ, భుజాల్నీ, చాతీ వంపుల్నీ చీర మడతల్నీ చూస్తూ అతని చూపులు అక్కడే నిలబడిపొయ్యాయి.

'ఎందుకిలా చూస్తున్నాను?' ఆవిణ్ణి తప్పించుకోవాలని కళ్లునెంచుకొంటూ, తనలో తనే ప్రశ్నించుకున్నాడు. 'ఏమైనా నేను లోపలికిపోయి బట్టలుమార్చ

కోవటం మానివేసి వెనక్కి తిరక్కుండా తిరిగి అయిదు అడుగులు వేశాడో లేదో ఆమెను ఇంకొక్కసారి చూడాలనిపించి, ఎందుకో, దేనికో తనకే తెలియకుండానే ఆమెవైపు చూశాడు. ఆమె దొడ్డిమూలదాకా వెళ్లి వెనక్కి తిరిగి అతనికేసి చూసింది.

'ఛి ఛీ, ఏమిటీపని!' మందలించుకున్నాడు. 'ఆవిడ ఏమనుకుంటుంది ... ఆ ఈపాటికి అనుకుంటూనే ఉంటుంది....'

తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఒక ముసిలావిడ ఆగది గచ్చును కడుగుతోంది. ఎజినీ ఠీవిగా నడిచి మురికి నీటితో తడిసిన ఆ గదిలో ఇంచుమించు చిందులు త్రొక్కాడు. పంచె మార్చుకోనే ప్రయత్నం వదలి, గోడమీదఉన్న జోళ్లు తీసుకొని వెళ్లబోతూంటే ముసిల్ది గదిలోంచి బైటకు నడిచింది.

'ఈ ముసిలిముండ బైటకి పోయింది కనుక ఇంక స్టెపానిడా ఒక్కర్తే లోపలికొస్తుంది.' అతనిలోని ఎవరో ఆలోచించసాగేరు.

'ఇదేమి ఆలోచన్రా నాయనా, ఇదేంపని!' చెప్పులు చేత్తో పుచ్చుకొని రెండు ఊరుపుల్లో హాల్లోపడి అక్కడ జోళ్లుతొడుక్కొని, తిన్నగా వరండాలోకి వెళ్ళి, ముసలమ్మలిద్దరూ కాఫీ త్రాగుతూంటే అక్కడ కూర్చున్నాడు. లీజా అతనికోసం ఎదురుచూస్తోంది. ఆవిడకూడా ఆ పక్క గుమ్మమంటే అప్పుడే వచ్చింది.

'అమ్మనాయనో! నేను గౌరవస్తుణ్ణనీ, పవిత్రుణ్ణనీ, అమాయకుణ్ణనీ అనుకునే లీజాయే— లీజాకే తెలిస్తే?' అనుకున్నాడు.

లీజా మామూలుగానే నవ్వుతూవచ్చి అతని ప్రక్కనే కూర్చుంది. కాని ఇవాళ ఎంచాతనో ఆమె ముఖం పాలిపోయి, తెల్లగా, పొడుగ్గా, నీరసంగా ఉన్నట్టు కనపడింది.

*     *     *     *     *

కాఫీలవుతున్నాయి. ఆ సమయంలో ఒకరకం ఆడజాతి సంభాషణ ప్రారంభమయింది. అలాంటి సంభాషణలకెలాంటి తార్కిక సంఘటనా ఉండనక్కర్లేదు. అది ఆ ఇంట్లో మామూలే. అలాంటి సంభాషణలు నిరాఘాటంగా కొనసాగవలసిందే.

ముసిలాళ్ళు ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు సూదిపోట్లు పొడుచుకుంటున్నారు. పాపం, లీజా మాత్రం అతి తెలివిగా వాళ్ళిద్దరి మధ్యా దోబూచు లాడుతోంది.

"మీరు రాకుండానే మీ గది కడిగించటం పూర్తి చేదామనుకున్నాను; కాని వీలివ్వలేదు. అయినా తొందరగా అయిపోతుంది లెండి" ఆమె భర్తతో చెప్పింది.

"దానికేంగాని, నేను లేచాక నీకు బాగా నిద్రపట్టిందా?"

"బాగానే నిద్రపోయాను. ఒంట్లో కూడా కులాసాగానే ఉంది."

"ఏం బాగో వల్లకాటిబాగు. ఒక మూల గోళ్ళు బ్రద్దలయ్యే సందలాయిరి. ఎండంతా కిటికీల్లోంచి దాని మీదనే పడుతోందంటే ఇంకేమి నిద్ర." వార్వారా వ్యాఖ్యానించింది. "కిటికీలకి రంగుఅద్దాలుంటే బాగుండేది. నాగరికి అలాగే ఉండేవి. ఇంతకీ అది ఓ పనిలేని మనిషి."

"పదిగంటలకల్లా మిద్దెలోకే పోతున్నాం గదా" అందుకుంది మేరీ.

"అందుకే జ్వరం వస్తుంది; రమ్మంటేరాదూ? అంతా తేరుగా ఉంటే," వార్వారా తిప్పికొట్టింది. రెండు నిమిషాల క్రితం ఆమె అన్నదానికీ ఇప్పుడామె అన్నదానికీ ఏమీసంబంధం లేదని ఆమెకు తెలియదు. "మా డాక్టరంటూండు: రోగిని చూడకుండా రోగాన్ని గుర్తించటం కష్టమని. ఆయనకి బాగా తెలుసు. పెద్ద పేరున్నవాడు; పైగా చూడటానికి వచ్చినప్పుడల్లా ఆయనకి వందదాకా ఇస్తూనే ఉంటాం. చచ్చి స్వర్గాన ఉన్నారు. ఆయనకి డాక్టర్లంటే ఒళ్ళుమంట; అయినా నా విషయంలో ఆయన ఎప్పుడూ కాదనలేదు."

"ఎవడు కాదంటాడు తన పెళ్ళాం మాట! అందులోనూ ఆమె జీవితమూ, ఆమె బిడ్డ జీవితమూ ఆధారపడ్డ..."

"అవును; ఆడదానికి చేతిలో నాలుగురాళ్ళుంటే చీటికీ మాటికీ మొగుడి మీద ఆధారపడఖ్ఖర్లేదు. మంచి భార్య ఎప్పుడూ అణకువగానే ఉంటుంది." అంది వార్వారా, "లీజా, పాపం, జబ్బుపడ్డప్పటినుంచీ చాలా నీరసంగా ఉంటోంది."

"అదేమీ కాదమ్మా. నాకేం! నేను దుక్కలా ఉన్నాను. నువ్వేమీతినవా?"

"నాకేమీవద్దే."

"ఆవిణ్ణీ తినమన్నాను; ఆవిడ వద్దుకాక వద్దంది." మేరీ అది తన తప్పుకాదన్నట్టు చెప్పింది.

"వద్దుతల్లీ నాకడుపు నిండుగానేఉంది." శ్రుతిమించి రాగాన పడుతూంటే తానే సర్దుకొంటున్నట్టు నటిస్తూ వార్వారా సంభాషణ మార్చి ఎజినీతో అంది:

"ఏంబాబూ, ఎరువులు జల్లించటం పూర్తయిందీ?"

లీజా ఫలహారం తేవటానికని లోపలికెళ్ళింది.

"ఒసేవ్! నాకొద్దే, నాకొద్దుబాబూ!"

"లీజా లీజా, కాస్తనింపాదిగా వెళ్ళమ్మా!" అంది మేరీ, "అలా ఉరకవేస్తే ఎంత ప్రమాదం!"

"మనస్సు కుదురుగా ఉంటే ఏ ప్రమాదమూ ఉండదు," అంది వార్వారా దేనినో సూచిస్తున్నట్టు. కాని, ఆ మాటలు సూచించగలిగిన సంఘటన గత చరిత్రలో ఏమీ లేదని ఆమెకు కూడా తెలుసు.

లీజా ఫలహారం పట్టుకొచ్చింది. ఎజిని కాఫీ పూర్తి చేసి అలాగే మత్తుగా కూర్చుని వింటున్నాడు. ఇలాంటి సంభాషణలు అతనికి కొత్త కాదు. వాటికి పూర్తిగా అలవాటు పడ్డాడు. అయితే కొత్త ఏమిటంటే వాటిల్లో ఎక్కడా అర్థం లేదని మాత్రం ఇవాళ గ్రహించటం. ఇంతకు పూర్వమే జరిగిన దాన్ని ఇంకొకసారి మననం చేసుకోవాలనుకున్నాడు. కాని, వీళ్ళ గందరగోళం అందుకు అవకాశం ఇవ్వలేదు. కాఫీ అయిపోగానే వార్వారా విషపునవ్వు నవ్వుకొంటూ వెళ్ళిపోయింది. లీజా, ఎజినీ, మేరీలు అక్కడే ఉండి పోయారు. చాలా కులాసాగా మాట్లాడుకున్నారు. కాని, లీజా, చాలా సూక్ష్మగ్రాహి కనుక, ఎజినీ ఎందుకో బాధపడుతున్నాడని గ్రహించింది. ఏదైనా పొరపాటు జరిగిందా అని ఆమె అడిగింది. ఇలాంటి ప్రశ్న వస్తుందని అతను అనుకోలేదు. అందుచేత కంగారుపడి, అబ్బే ఏమీ లేదని చెప్పటానికి రెండు నిమిషాలు పట్టింది. అది ఆమె అనుమానాన్ని పూర్తిగా ధృఢపరచింది. పాలల్లో ఈగ ఆమెకెంత స్పష్టమో, అతన్ని ఏదో చాలా విపరీతంగా బాధిస్తున్నదనే విషయం కూడా ఆమెకు అంత స్పష్టమయింది. అయినా అతను అదేమిటో చెప్పడు. ఏమిటయి ఉంటుంది?

*　　*　　*　　*　　*

కొద్దిసేపట్లో ఎవరితావున వాళ్ళు వెళ్ళి పోయారు. ఎజినీ మామూలుగానే తను చదువుకొనే గదిలోకి వెళ్ళిపోయాడు. ఉత్తరాలు వ్రాసుకోవటానికీ చదువుకోటానికీ బదులు ఒక సిగరెట్టు తర్వాత ఇంకొకటి ముట్టించి ఆలోచిస్తున్నాడు, తన పెళ్ళినాటి నుంచీ ఏ రాచపుండు బాధ అయితే వదిలి పోయిందను కున్నాడో, అదే, ఇవ్వాళ, తలవని తలంపుగా రేగటం అతన్ని కలత బెట్టింది; విపరీతంగా భయపెట్టింది. తన పెళ్ళి నాటినుంచీ ఒక్క తన భార్యమీద తప్ప—ఆమెమీదగాని—ఏ ఇతర స్త్రీ మీదగాని తనలో అలాంటి అనుభూతి రేగలేదు. తనకిలాంటి "విముక్తి" వచ్చినందుకు అతనెంతో సంతోషించే వాడు. కాని ఇలా తలవని తలంపుగా జరిగిన సంఘటన, అతను నిజంగా విముక్తుడు కాలేదని రుజువు పరిచింది. ఆ అనుభూతికి తాను లొంగి పోతున్నానిగాని, ఆమెను తాను కాంక్షిస్తున్నాననిగాని అతని భయం కాదు; ఆమెను కలలో కూడా అతను కాంక్షించటం లేదు; అయితే ఆ అనుభూతి అతనిలో పూర్తిగా చచ్చిపోలేదనీ, అది ఇంకా బ్రతికి ఉందనీ, దానితో అతనింకా పోరాడక తప్పదనీ అతని బాధ. దానిని ఎలాగైనా అణచి వేసుకోగలడు. దానికి అనుమానం కూడా లేదు.

ఒక ఉత్తరానికి అతను జవాబివ్వాలి. ఒక కాయితం కూడా వ్రాయక తప్పదు. అందుకని టేబిలు ముందు కూర్చుని ఉపక్రమించాడు. అది పూర్తి చేసి తనని ఆందోళన పరచిన సంఘటనని కూడా మరచిపోయి, [illegible]

వెళ్ళాలని బైటికొచ్చాడు. మళ్ళీ ఏలినాటి శని నెత్తిన తన్నినట్టు ఒక ఎర్రచీర మనిషి తనను చుట్టుముట్టి చేతుల్నీ శరీరాన్నీ ఊపుకొంటూ, చకచకా ముందుకు సాగిపోయింది. అలా సాగిపోవటమే కాకుండా ఆ ముందున్న నౌఖర్ని కలుసుకోవటం కోసం పరిగెట్టింది కూడా.

మళ్ళీ ఆ మిట్ట మధ్యాహ్నం ఆ దూలగొండి మొక్కలు, డానియల్ గుడిశ, ఆ చెట్ల గుబురుల మధ్య నవ్వుతూ ఆకు చివళ్ళను కొరుకుతూ ఆమె—అతని ఊహాపథంలో గోచరించాయి.

"ఆబ్బే ఇంక ఇలా సాగడానికి వీల్లేదు." అనుకున్నాడు. ఆ మనిషి కనుచూపుమేర దాటిపోయేదాకా ఆగి, తిన్నగా ఆఫీసుకు చేరుకున్నాడు.

మధ్యాహ్నం భోజనాలవేళ అయింది. మేస్త్రీ ఇంకా అక్కడే ఉండాలని వాంఛించాడు; అలాగే మేస్త్రీ కనిపించాడు కూడా. మధ్యాహ్నం కునుకులోంచి మేస్త్రీ అప్పుడేలేచి, చేతులుచాచి, ఆవలిస్తూ ఒళ్ళు విరుచుకుంటున్నాడు, ఎవరితోటో మాట్లాడుతూ.

"వాసిలీ!" ఎజినీ మేస్త్రీని పిలిచాడు.

"అయ్యా!"

"నీతో మాట్లాడాలి."

"చిత్తం"

"ముందు ఆ మాట్లాడేదేదో పూర్తిచేసెయ్."

"ఏమి? దాన్ని తీసుకొస్తున్నావా?" వాసిలీ పైల కాపును అడిగాడు.

"బరువుగా ఉందండీ, వాసిలీ గారూ."

"ఏమిటది?" అన్నాడు ఎజినీ.

"బీటిలో అవొకటి ఈ నిందండయ్యా...సరే నేను చూస్తాలే; నువ్వుపో."

పైల కాపువెళ్ళి పోయాడు.

"నీకు తెలుసుననుకుంటాను" ఎజినీ ప్రారంభించి, సిగ్గుపడ్డాడు. "నీకు తెలుసుగా వాసిలీ నేను బ్రహ్మచారిగా ఉన్నప్పుడు కొంచెం కట్టు తప్పానని...నువ్వు వినే ఉంటావు."

వాసిలీ తన యజమాని స్థితికి చాలా జాలిపడ్డాడు. "స్టెపానిడా సంగతాండి?" అతనికళ్లు నవ్వాయి.

"అవును. ఇటుచూడు. దాన్ని ఇంటిపనిలో పెట్టకు, నీకు పుణ్యముంటుంది. తెలిసిందా, నాకెంతో ఎబ్బెట్టుగా ఉంటుంది..."

"చిత్తం. బహుశా గేమస్తాగారే పెట్టిఉంటాడండి."

"కావచ్చు...సరే కాని, మిగతా ఎరువులుకూడా చల్లించండి." తన కంగారు అణుచుకోవాలని ఎజినీ ప్రయత్నించాడు.

"చిత్తం. అలాగే చేస్తానండి."

ఈ విధంగా ఆ కథ కంచికెళ్ళింది. ఎజినీ శాంతించాడు. ఒక సంవత్సరంపాటు ఆమెని చూడకుండా తను ఉండలేడు కనకనా! అలాగే ఇక ముందుకూడాను. 'పోతే, వాసిలీ ఈ సంగతి గుమస్తాతో చెప్తాడు. గుమస్తా స్టెపానిడాతో చెప్తాడు. నాకింక దాని అవసరంలేదని అదే గ్రహిస్తుంది,' అనుకున్నాడు ఎజినీ. ఎలాగో కష్టపడి వాసిలీతో ఖచ్చితంగా చెప్పగలిగినందుకు సంతోషించాడు కూడా.

"గుండెల్లో ఏదో చెయ్యిపెట్టి కెలికినట్టు పడే బాధకన్నా ఆ అవమానం కన్నా ఇది చాలా నయం" తను చేసిన ఆ పాపం ఆలోచనలో కొచ్చేసరికి ఆ జ్ఞాపకానికే అతని ఒళ్ళు ఝల్లుమంది.

* * * * *

తన సిగ్గునీ అవమానాన్నీ దిగమ్రింగుకొని, వాసిలీతో చెప్పుకోవాలని ఎజినీ చేసిన ప్రయత్నంలో పడ్డ నైతిక మథనలో అతని హృదయం తేలికయింది. అంతా చక్కబడ్డట్టే అతను భావించాడు. అతను చాలా ప్రశాంతంగా, ఇది వరకులాగే సుఖంగా ఉన్నాడని లీజా గ్రహించింది. 'మా అమ్మ, మా అత్త—ఒకళ్ళనొకళ్ళు దెప్పిపొడుచుకోపటం వల్ల ఆయన మనస్సు బాధపడింది. అంతే, ఇలాంటి గొడవలు ఎవళ్ళకన్నా దుర్భరమే. అందులోనూ ఆయన సున్నితమైన హృదయానికి మరీ కష్టం. అస్తమానూ ఒకళ్ళనొకళ్ళు ఆడిపోసుకొంటూంటే భరించటం ఎవరితరం?' అనుకుంది.

ఆ మరునాడు పెద్దపండుగ. ఆ పండుగనాడు అడవుల్లో పనిచేసే పాటక జనం యావత్తూ, ముఖ్యంగా ఆడాళ్లు, యజమాని ఇంటికి వచ్చి పాటలు పాడుతూ నృత్యం చేయటం ఒక సాంప్రదాయం. అలాగే ఆ వేళ ఆడవాళ్లంతా వచ్చారు. మబ్బు పట్టిన ఎండ అందంగా ఉంది. మేరి వార్వారాలు వరండాలోకి వచ్చి నిల బడ్డారు. చైనా శిల్కు వస్త్రాలు ధరించి, చిత్తుగా తాగి మామయ్య కూడా అక్కడికి తయారయ్యాడు.

పెళ్ళికాని పిల్లలు, పెళ్ళిఅయిన స్త్రీలు గుండ్రంగా నించున్నారు. వాళ్ళ రంగురంగు బట్టలు చాలా చిత్రంగా మెరుస్తున్నాయి. ఈ వలయానికి మధ్యన చుట్టూను, సూర్యుడినుంచి విడివడి తమచుట్టూ తాము ప్రదక్షిణం చేస్తూ సూర్యుడి చుట్టూ తిరిగే ఉపగ్రహాలల్లా, మరికొందరు నించున్నారు. చెయ్యీ చెయ్యీ కలుపుకు గిరగిర తిరుగుతున్నారు. మర్రకుంకలు కిచకిచ లాడుతూ ఒకళ్ళ వెనుక ఒకళ్ళు ముందుకీ వెనక్కీ నడుస్తున్నారు. బాగావయస్సు వచ్చిన యువకులు తలపై టోపీలతో ఎర్రటి కోట్లు తొడుక్కొని సూర్యకాంతం పువ్వు గింజల్ని తుబుక్కున ఉమ్మి

తున్నారు. నృత్యం అతికోలాహలంగా ప్రారంభమయింది. వరండాదిగి ముసిలమ్మలిద్దరూ కొంచెం దగ్గరగా వచ్చారు. లీజాకూడా వాళ్ల ననుసరించింది. లేత నీలంరంగు బట్టలు కట్టుకొంది లీజా.

ఎజినీ బైటకొద్దామనుకోలేదు; అయితే దాక్కోవటం ధర్మం కాదు. కనుక తను కూడా సిగరెట్టు కాల్చుకొంటూ బైటికొచ్చి, ఆ జనసమూహానికి నమస్కరించి, వాళ్లల్లో ఒకరితో మాటాడాడు. వెంటనే ఆవాళ్లు వాళ్ల శక్తికొద్దీ నృత్యం గానం అంకించుకొన్నారు.

"అమ్మా, అయ్యగార్ని కూడా ముందుకు రమ్మంటున్నారండి!"—ఒక యువకుడు ముందుకొచ్చి లీజాతో చెప్పాడు. లీజా ఎజినీనివచ్చి డ్యాన్సుచూడమని పిలిచింది. ముఖ్యంగా అద్భుతంగా నృత్యంచేస్తున్న ఒకామెకేసి చూడమంది. ఆమె స్పైపానిడా. పసుపుపచ్చని చీరకట్టింది. ఉదారంగు బాడీలేని జాకెట్; బలిష్ఠమై, ఉవ్విళ్లూరించే ఉత్సాహంతో శరీరాన్ని ఊపుతోంది. సందేహంలేదు ఆమె గొప్పగానే డ్యాన్సు చేసింది. అతనేమీ చూడలేదు.

"అవునవును" అనుకున్నాడు; కళ్ళజోడు తీసి జేబులో పెట్టుకున్నాడు. 'అవునవును' అనుకున్నాడు; మళ్ళీ కళ్ళజోడు జేబులోంచి తీసి ముక్కుకు తగిలించుకొన్నాడు. 'అయితే ఇంక దీన్ని తప్పించుకోవటం నా తరం కాదన్నమాట,' అనుకున్నాడు.

అతను ఆమెకేసి చూడలేదు. ఆమె ఆకర్షిస్తుందేమోనని అతని భయం. బహుశా అందుకనేనేమో అతను పొరపాటున చూసిన చూపులోనే ఆమె ఆకర్షింప బడింది. అదిగాక ఆమె ఓరచూపును బట్టి ఆమె అతన్ని చూసిందనీ, అతను ఆమెని చూసి తన్మయం చెందినట్టు ఆమె గ్రహించిందనీ, ఎజినీ గ్రహించాడు. మర్యాదకి అవసరమైనంత సేపూ అక్కడే నిలబడ్డాడు. కాని, తీగా వార్వారా సంతోషంతో వళ్ళు తెలియక దాన్ని 'అమ్మాయీ' అని తెలివి తక్కువగా చేర బిలిచి కబుర్లు పెట్టగానే చటుక్కున వెనుదిరిగి ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

దాన్ని చూడకూడదనే దృఢనిశ్చయంతోనే అతను ఇంట్లోకి వెళ్ళిపోయాడు. వెళ్ళాడుగాని తిరిగి యెలాగో యెందుకో తెలియకుండానే కిటికీ వెనక నిలబడి అదే పనిగా చూసి చూసి ఆ అందాన్ని తన కళ్ళకు విందు చేశాడు.

ఎవళ్లూ చూడనప్పుడు మేడమీంచి కిందకి పరిగెట్టి, వరండాలోకి కాళ్ళు ఎత్తి ఎత్తి వేసుకొంటూ వచ్చి, అక్కడ సిగరెట్టు ముట్టించి, అవుటుకి వెడుతున్నట్టు నటిస్తూ, ఆమెను వెంబడించాడు. రెండడుగుల్లో వేశాడో లేదో దానిమ్మ చెట్టు వెనకాల ఉదారంగు బాడీలేని జాకెట్టునీ పసుపు పచ్చ చీరనీ చూశాడు. ఇంకో ఆమెతో కలిసి ఆవిడ ఎక్కడికో వెడుతోంది. 'వాళ్ళెక్కడికి వెడుతున్నారు?'

అకస్మాత్తుగా ఒక మహా భయంకరమైన వాంఛ అతని హృదయాన్ని పిండినట్టయింది. ఎవరి ఆజ్ఞనో శిరసావహిస్తున్నట్టు చుట్టూచూసి ఆవిణ్ని అనుసరించాడు.

"అయ్యా దొరగారూ, దొరగారూ! మీ దర్శనం కోసం వచ్చాను." వెనకాల తనకోసం అరుస్తున్న గొంతుక. నుయ్యి తవ్వుతున్న ముసలి కూలీని చూసి చటుక్కున వెనుదిరిగి అతని దగ్గిరికి వచ్చాడు. అతనితో మాట్లాడుతూనే పక్కకి తిరిగి, వాళ్ళిద్దరూ సాలో పుంతలోకి వెళ్ళి పోతూండటం చూశాడు. బహుశా నూతి దగ్గిరికి కాబోలు: లేక అదో వంకో! అక్కడ రెండు నిమిషాలు ఆగి మళ్ళీ మందలోకి పరుగెత్తుకు వచ్చేశారు.

* * * * *

కూలీతో మాట్లాడిన తర్వాత, మహాపరాధం చేసిన వాడిలా ఖిన్నుడై ఎజినీ ఇంట్లోకి వెళ్ళిపోయాడు. మొదటి సంగతి ఆమె అతన్ని అర్థంచేసుకొంది; అతనికి ఆమెను చూడాలనే వాంఛబలీయంగా ఉన్నట్టు విశ్వసించింది; ఆమెకూడా వాంఛించింది. రెండవది! కూడా వచ్చిన ఆవిడకికూడా ఈ సంగతి తెలిసిపోయింది.

ఇవన్నీ ఇలా ఉండగా తాను ఓడిపోయానని ఎజినీ అనుకున్నాడు; తన ఇంద్రియ నిగ్రహం తననే జయించింది; తనకు తనపై అధికారంలేదు; తనలోని ఎవరో తనపై అధికారం చెలాయిస్తున్నారు. ఇంతవరకు ఈ గండాన్ని గడచి బైట పడటానికి కారణం కేవలం అదృష్టమే. ఇవేళ కాకపోతే రేపు, తప్పితే ఎల్లుండి — ఇక తన పతనం తప్పదు.

'అవును; పతనమే,' అతను ఇంకోలా అర్థం చేసుకోలేడు. తనని ప్రేమించే తన చిన్న భార్యకి ద్రోహం చేయటం, ఎవర్తో ఒక పల్లెదాన్ని అంటుకోవటం, అందులోనూ అందరూ చూస్తుండగా — అదిపతనం కాక ఇంకేమిటి? పతనమే; పతనమే; ముమ్మాటికీ పతనమే. బతకటం అసాధ్యమైనంత పతనం! వీల్లేదు, యేదో చెయ్యాలి.

"ఓరి దేవుడా, ఏం చెయ్యను? చివరికి ఇలా పతనం పొందవలసిందేనా?" అనుకున్నాడు. ఏపని చేయటమూ సాధ్యంకాదా? అయినా ఏదో చెయ్యక తప్పదు. 'అసలు ఆమెను గురించి ఆలోచించవద్దు!' ఆజ్ఞాపించుకున్నాడు. 'ఆలోచించకు!' వెంటనే ఆలోచించటం ప్రారంభించాడు. ఆమె కళ్ళముందు కనిపించింది. ఆమె ముఖం మీద ఆకుల నీడలు కూడా కనిపించాయి.

ఒక సన్యాసి కథ జ్ఞాపకం వచ్చింది. వెనకటికి ఒక సన్యాసో ఒక రుషీంద్రుడో కాని తాను వలచిన ఒక స్త్రీని ఆమె పుండుమీద మందు పట్టించే మిషతో ఆమెను తాకి__ఆ తరవాత పశ్చాత్తాపంలో సలసల మరిగే నూనెలో వేళ్ళుపెట్టి కాల్చుకున్నాడట. ఆకథ జ్ఞాపకం తెచ్చుకున్నాడు. 'అవును చూసి చూసి పతనం పొందలేను. చేతులన్నా కాల్చుకుంటానుగాని, గదిఅంతా కలయ చూశాడు; గదిలో

ఎవరూ లేరు. దీపం వెలిగించాడు. ఒకదాని తర్వాత ఒకటి కాల్చుకోవటం మంచిదని ముందు ఒక వేలు మంటలో పెట్టాడు. 'ఈసారి ఆమెను గురించి ఆలోచించు; ఏం?' వెటకారంగా తనలో తనే అనుకున్నాడు. వేలు చుర్రుమంది; చటుక్కున ఆ పొగ కారిన వేలు తీసుకొని నోట్లో పెట్టుకున్నాడు. అగ్గిపెట్టి అవతల పారేసి తన తెలివి తక్కువకు తానే నవ్వుకున్నాడు. పిచ్చిగాని, అదా తను చెయ్యవలసిన పని! అయినా ఏదో చెయ్యాలి—ఆవిణ్ని చూడకుండా ఉండాలంటే తనన్నా వెళ్ళిపోవాలి; లేక దాన్నన్నా పంపించి వెయ్యాలి. అవును ఆవిణ్నే పంపిస్తే? తనతో బస్తీకి తీసుక పోవటానికో లేక ఇంకో గ్రామానికన్నా సరే—ఏదో చెయ్యమని ఆమె భర్తకి కొంత డబ్బిస్తే? అమ్మయ్యో అల్లరి కాదూ! అందరూ ఈ ఊసే చెప్పుకోరూ! అం అయితే ఏం? ఈ ప్రమాదం కంటే అదే నయం కదా. 'అవును; అదే నయం' అను కున్నాడు. అనుకుంటూనే కళ్ళను కదల్చకుండా, అలాగే ఆమె కేసి చూశాడు. 'ఆమె యెక్కడికి కెడుతోంది?' వెర్రిగా తననే ప్రశ్నించుకున్నాడు. ఆ ప్రశ్నకు తనే జవాబు చెప్పుకోవాలి. అతనికి అనిపించింది: ఆ కిటికీలోనుంచి దీనంగా చూసి ఇంకో స్త్రీ చేతిలో తన చెయ్యి పెట్టుకొని అలా అలా దూరంగా ఊపుకుంటూ వెళ్ళిపోతున్నట్లు. ఎందుకో ఎక్కడికో తెలియకుండానే, ఏదో ఆలోచించుకొంటూ నూటిగా ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

వాసిలీ ఎవరితోటో మాట్లాడుతూ తాపీగా చుట్ట కాల్చుకుంటున్నాడు.

"వాసిలీ, నీతో ఒక మాట చెప్పాలి."

"ఫరవాలేదు చెప్పండి."

"ఒక సారి ఇట్లా రా చెప్తాను."

"ఇలాగే రమ్మంటారా? రెండు నిమిషాల్లో వస్తానుండండి."

వాసిలీ తాగి ఉన్నట్లు ఎజినీ గ్రహించాడు; అయినా తప్పుతుంది గనకనా? ఏ మైనా తనకున్న కష్టాల్లో అతను తప్పకుండా తన సానుభూతి చూపించగలడు.

"అదే ఆపాత గొడవే మాట్లాడదామని వచ్చాను, వాసిలీ!" అన్నాడు ఎజినీ "దాన్ని గురించి."

"దానికేమండి! దాన్ని పనిలోకి పిలవద్దని చెప్పాగా!"

"అది కాదు. నేనేదో ఆలోచిస్తున్నాను. నీ సల[illegible] ఒకటి కావలసివచ్చి: వాళ్ళని ఊరినుంచి వెళ్ళ గొట్టటం పడదంటావా? మొత్తం కుటుంబమంతా."

"వాళ్ళ నెక్కడికి పంపగల మండి?" వాసిలీ అన్నాడు. అతనికి ఈ ఆలోచన నచ్చలేదు. పోగా అతని గొంతుకలో వెటకారం స్పష్టంగా వినిపించిది ఎజినీకి.

"ఏదో దూరం ఊళ్లో కొంతభూమో, కొంత డబ్బో ఇచ్చి పంపించివేస్తే — మళ్లీ అది నాకళ్లపడదు కదా అని!"

"అది సరే; వాళ్లని పంపటం ఎలాగని? ఉన్న కొంపా గోడీ ఏంచేసుకోవాలి? అయినా మీరెందుకలా చెయ్యాలి? అది మీకేమి అపకారం చేసింది?"

"అహఁ, వాసిలీ, ఆ సంగతి నా భార్యకి తెలిస్తే ఆవిడ ఒక్కక్షణంకూడా బ్రతకదు."

"ఆవిడికి ఎవరు చెప్తారులెండి"

"ఆ భయంతో ఎలా బ్రతకటమా అని. ఇదంతా నా ప్రాణాలమీద కొచ్చింది."

"ఎందుకండీ అలా బాధపడతారు? గత ఘంటా ఎవరు తప్పు తాసు చెప్పండి — అందులోనూ ఏనాటి కథ ? అందరూ అంతో ఇంతో పాపం చేసినవాళ్లే."

"అవునను కో. అయినా వాళ్లపీడ వదుల్చుకోవాలి నువ్వు ఆమె భర్తతో చెప్పలేవా?"

"చెప్పి లాభంలేదండయ్యా. ఏఁ, మీరిల్లా ఇదయితే యెలాగండి? జరిగి పోయిందేదో జరిగి పోయింది. యెన్నో జరుగుతూ ఉంటాయి. ఇప్పుడు మిమ్మల్ని గురించి పల్లెత్తి మాట్లాడ గలిగిన వాడెవడు? అందరూ మిమ్మల్ని చూస్తూనే ఉన్నారు."

"అయినా ఒకసారి అతనితో మాట్లాడి చూద్దూ."

"సరేలెండి. అసకూడా చూస్తాను."

ఈ ప్రయత్నం బొత్తిగా నిరర్ధకమని తెలిసినప్పటికీ అది కొంత ఊరట నిచ్చింది. పోగా అనవసరంగా గోరంతని కొండంతగా చేసుకుని భయపడుతున్నాడని గ్రహించ గలిగాడు.

యెక్కడన్నా సంకేతం ఏర్పరచి ఆమెనే కలుసు కొంటేనో! అసాధ్యమే. తోటలో పచారుకని వెళ్ళాడు. ఆమె అక్కడినుంచి పారిపోవలసి వచ్చింది.

*   *   *   *   *

ఆవేళ సాయంత్రమే కొంత చల్లబడ్డాక లీజాని తీసుకొని మైదానంలోకి షికారు బైలుదేరాడు. ఒక రకం సువాసన గడ్డిని చూపించాలని భర్త పిలవగానే ఒక చిన్న గొయ్యిదాటుతూ కాలుతొట్రుపడి లీజాపడింది. చాలా జాగ్రత్తగానే పడ్డదికాని, గావుకేక పెట్టింది. ఆమె ముఖంలో భయాన్నీ బాధనీ ఎజినీ గుర్తించాడు. అతను వచ్చి లేవదీయబోయాడు కాని ఆమెయే చేతుల్తో వెనక్కి నెట్టే సింది.

"వద్దు, ఉండండి." చాలా నీరసంగా నవ్వింది. ఏదో తప్పుచేసినట్టు భీతిగా అతనికేసి చూసింది. "కొంచెం కాలు బెణికిందంతే."

"నేను చెవికి నోరుకట్టుకొని చెప్తూనే ఉంటాను. ఈ స్థితిలో యెవరన్నా గోతులు మాకుతారా?" ఇక వార్వారా ప్రారంభించింది.

"అబ్బే, యేమీ లేదమ్మా. చూడు నేనే లేస్తాను." భర్త చెయ్యి ఊతం పుచ్చుకొని లేచి నిలబడింది. కాని వెంటనే ఆమె ముఖం పాలిపోయింది. ఆమెకు గుండెల్లో దడ పుట్టింది.

"అమ్మా నావంట్లో బాగోలేదే!" తల్లి చెవిలో ఏదో చెప్పింది.

"అమ్మ నా తల్లో యెంతపని చేశావే! అక్కడికి వెళ్ళకే తల్లీ అని నెత్తీ నోరూ మొత్తుకున్నాను; విన్నావా?" వార్వారా కళ్ళనీళ్ళు పెట్టుకొంది. "ఉండు; నాఖర్లను పిలుస్తాను. నువ్వు నడవకూడదు. దీన్ని ఎత్తుకెళ్ళాలి."

"భయంలేదు లీజా; నేను తీసికెడతాను" తన కుడిచెయ్యి ఆమె నడుంచుట్టూ వేశాడు. "నా మెడ పట్టుకో. అదీ అల్లాగ." కిందకివంగి, తన ఎడమ చేతిని ఆమె మోకాళ్ళ క్రిందకి పోనిచ్చి, ఆమెను పైకెత్తాడు. ఆమె ముఖంలో ఆక్షణంలో కనిపించిన ఆ బాధనీ, దాని వ్యంజనలోని అందాన్నీ, ఆ తరువాత అతనెన్నడూ మరిచి పోలేదు.

"మీకు నేను చాలా బరువుగా ఉన్నాను కదండీ," ఆమె నవ్వుతూ అంది. "అమ్మ పరుగెడుతోంది, చెప్పండి!" ఆమె ముందుకు వంగి అతన్ని ముద్దుపెట్టుకుంది. అతను ఆమెను ఎలా ఎత్తుకెడుతున్నాడో తన తల్లి చూడాలని ఆమె సరదా పడ్డది.

పరిగెట్టవద్దని ఎజినీ వార్వారాను హెచ్చరించాడు; తాను లీజాని తీసుకొస్తున్నానని కూడా అర్చాడు. వార్వారా ఆగి, మరింత గట్టిగా అరవసాగింది.

"దాన్ని పడేస్తావ్; బాబోయ్, నువ్వు దాన్ని పడేస్తావ్. దాన్ని చంపేసే దాకా నీకు నిద్ర పట్టదు. చివరికి దాన్ని నీ యెగాన్ని పెడుతున్నాను. నీకేమీ బుద్ధి లేదు. నువ్వు ఛండాలుడివి!"

"నేను జాగ్రత్తగానే తెస్తున్నానండి."

"నాకూతుర్ని నువ్వు గొంతుపిసికి చంపుతూంటే నేను చూస్తూ కూచుంటానా? నేనొప్పుకోను." ఆమె ఇంకా ఒొప్పుకొంటూ పరిగెట్టసాగింది.

"పోనిస్తురూ, అదే పోతుంది." లీజానవ్వుతూ అంది.

"ఇదివరకటిలా జరక్కపోతే నయమే."

"దాన్ని గురించి కాదు నేనంటూంట! మా అమ్మని గురించి. మీరు అలిసి పోయ్యారు కాస్సేపు విశ్రమించండి."

మొత్తానికి కొంచెం బరువనిపించినా, ఎలిస్ తన భారాన్ని ఎంతో సంతో షంగా, గర్వంగా మోసుకొచ్చాడు. దానిలో వార్వారా పంపిన దాసీదానికి గానీ, వంటవాడికిగాని అప్పగించలేదు. పడకగదిలోకి తీసికెళ్ళి మంచం మీద ఒడుపుతో పెట్టాడు.

"ఈ సారి వెళ్ళండి. నేనూ అమ్మా కలిసి మిగతా పని చూసుకుంటాం." అతని చెయ్యి అందిపుచ్చుకొని, తియ్యగా ముద్దు పెట్టుకొంది.

మేరీకూడా పరుగెత్తుకెళ్ళింది. లీజా బట్టలన్నీ ఊడదీసి మంచం మీద పడుకో బెట్టారు. ఎజినీ ఆ పక్క గదిలో చేతిలో పుస్తకం పట్టుకొని ఎదురు చూస్తున్నాడు. వార్వారా అతని పక్కనుంచే వెడుతూ, చాలా కోపంగా అతనికేసి చూసి, ఏదో కొంపమునిగినట్టు పరిగెట్టింది.

"ఎలా ఉందండి?"

"ఎలా ఉందా? ఎందుకడుగుతావ్? నీ భార్యచేత ఆ గొయ్యిదూకించి నప్పుడు ఎలాఉండాలనుకున్నావో అలాగే ఉంది."

"అత్తగారూ!" చరుమన్నాడు ఎజినీ. "ఇంక లాభం లేదు. సంసారాలు తగలెయ్యాలనీ, అందర్నీ ఏడిపించాలనీ మీకుంటే" ["ఇంకెక్కడికన్నా దయ చేయండి" అందామనుకున్నాడు కాని] "ఆగోతిలో మీరెంచేత పడలేదు?" అన్నాడు.

"అబ్బో, పడేగోతిలో నీపెళ్ళినాడే పడ్డాను." చాలా విసురుగా వెళ్ళి పోయింది.

తగిలినదెబ్బకూడా కొంచెం గట్టిదే. లీజా కాలు వంకరయ్యింది. మళ్ళీ గర్భ విచ్ఛిన్నం జరిగే ప్రమాదంకూడా ఉంది. ఆమె సాక్షీగా పడుకోవటం తప్ప చేసేదేమీ లేదనిఅందరికీ తెలుసు. అయినా డాక్టరికి కబురుపెట్టారు.

"డాక్టర్ గారూ," ఎజినీ వ్రాశాడు. "మీరెప్పుడూ మామీద దయగానే ఉంటూవచ్చారు; నా భార్యకి ఇవేళ మీరు సహాయానికి రానని తిరస్కరించ రనుకుంటాను. ఆమె..." ఇలా గాసుకెళ్ళాడు. వ్రాసి తిన్నగా పశువులశాల దగ్గిరకెళ్లి గుర్రబ్బండీ కట్టించాలనుకున్నాడు. డాక్టర్ని తీసుకురావాలి; మళ్ళీ పంపించి వెయ్యాలి; అది చాలా పెద్దపనే. బండిని ప్రయాణంచిపంపి, చక్కావచ్చేసరికి తొమ్మిది దాటింది. భార్య కిందపడుకుంది. ఏమీ బాధగా లేదనీ, ఒంట్లో కులాసాగానే ఉందనీ ఆమె చెప్పింది. వార్వారా అక్కడే దీపంపక్క కూర్చుంది. ఆమె ముఖాన్ని చూస్తే తీరా యింతవరకూ వచ్చాక ఇంక శాంతి అసాధ్యమనే భావం కనిపిస్తోంది. యెవరేం చేసినా, తన విధిమాత్రం తాను నిర్వర్తించక తప్పదన్నట్టు కూర్చుంది.

ఎజినీ అది కనిపెట్టాడు. అది కనిపెట్టనట్లు నటించి తను బండి పంపించిన సంగతీ, గుర్రాలు యెలా దౌడుతీశాయో అదీ వివరించాడు.

"అవును. అవసరం వచ్చినప్పుడే గుర్రాల్ని అవస్థపెట్టాలి. బహుశా డాక్టర్ గారుకూడా ఆ గోతిలో పడచ్చు" అంది వార్వారా. అంటూ దీపానికి మరికొంత దగ్గరగా జరిగింది.

"యెలాగో అలాగ మనిషిని పంపక తప్పదు కదా. నాకు చేతనైన పద్ధతిలో నేనూ చేశాను."

"అవును. మీ గుర్రాలు యెలా దౌడుతీస్తాయో నేనుకూడా చూశానుగా." ఆ దెప్పుడు ఆవిడ యెప్పుడూ మరిచిపోలేదు. అవకాశం వచ్చినప్పుడల్లా ఉపయోగిస్తూనే ఉంది. జరిగిం దది కాదని ఎజినీ చెప్పాలనుకున్నాడు; కాని:

"నేను అస్తమానూ ఊరికేనే అనటంలేదు రాక్షసితోనన్నా బ్రతకొచ్చుగాని, అవిశ్వాసపాత్రులతోటీ, మూడచాందులతోటీ కాపురం చెయ్యటం కష్టమని. అంతకంటే అడవిలో మ్రానై పుట్టడం నయం."

"యెవరైనా యెవరివల్లనన్నా యెక్కువ బాధపడివుంటే, నాకంటే ఇంకెవరూ లేరు" అన్నాడు ఎజినీ "కాని, మీరు..."

"ఆ తెలుస్తోనే ఉంది."

"ఏమిటి తెలుస్తోంది?"

"ఏమీ లేదు; దీపం మీదకి పురుగువాలింది."

ఎజినీ ఆమె మంచం పక్క అలాగే నిశ్చేష్టుడై నిలబడ్డాడు. దుప్పటిలోంచి ఆమె చెయ్యితీసి అతని చేతిని పట్టుకొని తనవైపు లాక్కొని అతని కళ్ళల్లోకి చూసింది. 'నాకోసం ఆవిడ ఏమన్నా భరించండి. ఆమె ఏమన్నా మన జీవితాల్ని విడదీయలేదు.' అదీ ఆమె చూపు చెప్పినమాట.

"పోనీలే నేనేమీ అనుకోను." ఆమె నవ్వి చెప్పింది. ఆమె ప్రేమ పూరిత నయనాల్ని ముద్దుపెట్టుకొన్నాడు; అతను ముద్దుపెట్టుకొంటూంటే అవి అర్ధనిమీలితాలయ్యాయి.

"నీకు ఒంట్లో ఎలా ఉంది? మళ్ళీ కొంపతియ్యవుకదా!"

"నేను భయపడ్డానంతే; అబ్బిగాడు గాబరిపడ లేదు: బాగానే ఉన్నాడు." అంటూ తనకడుపుకేసి చూసుకొంది.

"ఆ ఆలోచనే భయంకరంగా ఉంటుంది."

లీజా పోయి పడుకోమని ఎంత చెప్పినా వినక ఆ రాత్రల్లా అక్కడే గడిపాడు. కనురెప్ప కూడా మూయలేదు. ఏ సమయానికి ఏమి అవసరం వస్తుందోనని వెయ్యికళ్ళు కాస్తూ కూర్చున్నాడు.

ఆరాత్రి బాగానే గడిచిపోయింది. డాక్టర్ కోసం కబురుపెట్టకుండా ఉండి ఉన్నట్టయితే లీజా లేచి తిరిగేదే.

మధ్యాహ్నం భోజనాల వేళకల్లా డాక్టర్ వచ్చాడు. మళ్ళీ ఆ లక్షణాలు వచ్చే భయం పూర్తిగా పోలేదన్నాడు అయినా నిజానికి అందుకు అనుకూలమైన లక్షణాలు లేవన్నాడు. పోగా దానికి వ్యతిరేకమైన లక్షణాలు లేకపోవటం వల్ల బహుశా ఇదిగాని తప్పితే అదిగాని అయ్యే అవకాశం ఉందని అనుకోవచ్చునన్నాడు. కాబట్టి ఆవిడ కదలకుండా పడుకోవాలి, 'నాకు మందివ్వటం అనవసరమని తోచినా అయినా ఈ మిక్చర్ తీసుకోమనండి' అన్నాడు. ఇదిగాక ఆడవాళ్ళ శరీర శాస్త్రం మీద వారావారికి ఒక ఉపన్యాసం కూడా ఇచ్చాడు. అదంతా ఆమెకు కొట్టిన పిండైనట్టు అన్నిటికీ జౌనంటూనే ఉంది. తన ఫీజు తీసుకొని, సహజంగా మణికట్టుకు దగ్గరగా పట్టుకొని డాక్టరుగారు దయచేశారు, రోగినిమాత్రం వారంపాటు మంచం మీద విడచి.

*     *     *     *     *

ఎజినీ ఆ వారంలోనూ యెక్కువకాలం తన భార్య మంచందగ్గిరే గడిపేవాడు; ఆవిడితో ఏదో మాట్లాడుతూనో, ఆపిడికి ఏదైనా చదివి వినిపిస్తూనో — అన్నిటికన్నా కష్టం యేమిటంటే వారావారా చీటికీ మాటికీ చేసే రాద్ధాంత సిద్ధాంతాల్ని తట్టుకోవటం; అందులోనూ వాటిని వేళాకోళాల కింద మార్చటం మరీకష్టం.

అయినా అస్తమానూ ఆవిడదగ్గరే ఉండటానికి వీల్లేకపోయింది. మొదటిది అతని భార్య ఒత్తిడి; నిద్రాహారాలు మాని అక్కడేవుంటే ఆరోగ్యం చెడిపోతుందని ఆమె గోలచేసేది. రెండవది: వ్యవసాయపు పనులు; అక్కడ ఏక్షణం లేకపోయినా అవి సాగటం మానేటట్టు తయారయ్యాయి. అందుకని ఇంటిదగ్గిరవుండటం వీలిచ్చింది కాదు. చేలోనో, తోటలోనో, అడివిలోనో ఉండక తప్పలేదు. యెక్కడున్నా స్టెపానిడా ఆలోచనేగాక ఆమె ఊహా విగ్రహంకూడా అతన్ని వెంటాడేది. ఆమెని

మరవటం యెప్పుడో గాని సాధ్యమయ్యేది కాదు. నిజాని కదంత గొప్పసంగతి కాదు; ఆ అనుభూతిని చాలా తేలిగ్గా జయించగలిగే వాడే. కాని వచ్చిన చిక్కేమిటంటే, ఇది వరకు నెలల తరబడి ఆమెని చూడకుండా గడపగలిగినా, ఇప్పుడు ఎక్కడో ఒకచోట ఎలాగో అలా ఆమె తటస్థపడుతూనే వచ్చింది. అతను మళ్ళీ ఆమెతో సాంగత్యాన్ని కోరుతున్నాడని భావించి, ఆమె మాటి మాటికీ అతనికి ఎదురు వచ్చేది. అతనుగాని ఆమెగాని ఏమీ పెదవి విప్పేవారు కాదు. అందుచేత అతను గాని ఆమెగాని సంకేత స్థలం దగ్గిర కాచుకు కూర్చోక పోయినా, ఆ అవకాశం రావాలని వాంఛించే వారు.

కొడవళ్ళు చేతబట్టుకొని, ఆవులకు గడ్డికోసం రైతుస్త్రీలు వెళ్ళే అడవే వాళ్ళు కలుసుకో దగ్గస్థలం. ఎజినీకి ఆ సంగతి తెలుసు. అందుకని రోజూ అక్కడికే వెళ్ళే వాడు. ఏ రోజు కా రోజు అలా వెళ్ళకూడదనే నిర్ణయించు కొనేవాడు. కాని ఏ రోజు కారోజు ఆ అడివిలోకి వెళ్ళటం, అక్కడ గొంతుకలు వినబడే సరికి, పొద చాటున దాగొని, కృంగుతున్న హృదయంతో, ఆమె కనిపిస్తుందేమోనని చూడటం ఒక పరిపాటయి పోయింది.

అక్కడ ఆమెయే ఉండాలని ఎందుకు చూస్తున్నాడో అతనికి తెలియదు. అక్కడ ఆవిడే ఉండి ఆవిడ ఒంటరిగా ఉండటం తటస్థించినా కూడా ఆవిణ్ని సమీపించకుండా___ అతని నమ్మకం అది___ బహుశా పారిపోయే వాడేమో! ఏదైనా ఆమెని చూడాలని మాత్రం అతను విపరీతంగా మధన పడేవాడు.

ఒకసారి ఆమెను కలుసుకున్నాడు. అతను అడివిలోకి వెళుతుంటే ఆమె ఇంకో ఇద్దరు స్త్రీలతో బైటకొస్తోంది. నెత్తిమీద పెద్ద గడ్డిబుట్ట పెట్టుకొంది. నాలుగు నిమిషాలన్నా ముందయితే ఆమెను అడివిలోనే కలుసుకొని ఉండేవాడు. తీరా ఇప్పుడు పక్కని ఇంకా ఇద్దరు ఆడవాళ్ళుండగా, అతనికోసం ఎలా అడివిలోకి వెడుతుంది? ఈ అసాధ్యాన్ని అతను గ్రహించి నప్పటికీ ఆమెకోసం ఒక గురువింజ చెట్టుచాటున ఎదురుచూస్తూ నిలబడిపోయాడు, చివరికి ఆవిడ రానేలేదనుకో. అయినా అతను చాలా సేపు ఎదురు చూశాడు. చిత్రంకాకపోతే ఆమె అతనికోసం ఆ సమయంలో ఐదారుసార్లన్నా వచ్చి అతని ఎదుట నిలబడి నవ్వినట్టనిపించింది. ఒకసారికంటే ఇంకొకసారి మరీ ఉధృతంగా మరీ ఆకర్షకంగా కనిపించేది. కళ్లు సులుముకుంటే ఏమీ లేదు.

శ్రుతిమించి రాగాన పడ్డదని గ్రహించాడు. అయింది. తనమీద అధికారం తనకి తప్పిపోతోంది. తన ఇంద్రియాల్ని తానింక జయించలేడు. తనకు ఇంచుమించు పిచ్చెత్తినట్టే. అయితే అతను తనమీద అధికారాన్ని వదులుకోలేదు జితేంద్రియత్వం కోసం యావచ్ఛక్తీ వినియోగిస్తూనే ఉన్నాడు. అయినా అతని వాంఛ తిరగబడి రంకెలు వేస్తూనేవుంది. తను యెంత కళ్ళెంపట్టి లాగినా అతన్ని ఆడవులు పట్టిస్తూనే

ఉంది. ఎక్కడున్నా చీకట్లో ఆమెకి దగ్గరపడితేచాలు, ముట్టుకుంటేచాలు, తన అనుభూతులకు లొంగిపోక తప్పదని అతనికి తెలుసు. అదే అతనికి నలుగురిలోనూ, ఆమెముందు, చివరికి తనముందుకూడా అవమానమని అతనికి తెలుసు. అందుకే అతను బాధపడుతున్నాడు. అందుకనే చీకటినిగానీ, ఏకాంతాన్నిగాని అతను కోరుకుంటున్నాడనీ, అప్పుడైతే తన పశు ఉద్రేకం విశృంఖలంగా చెలరేగ వచ్చుననీ అతనికి తెలుసు. కాబట్టి తనంత పాపిలేడని తెలుసుకున్నాడు. అందుకే ఆత్మ శుద్ధిగా తనను తాను నిందించుకోవటం, ద్వేషించుకోవటమున్నూ. అతను ద్వేషించుకోవడానికి కారణంకూడా అతనింకా లొంగక పోవటమే; కనుకనే రోజు రోజూ భగవంతుణ్ణి, తనను జితేంద్రియుణ్ణి చేయమనీ, తనను ఎట్లాగో పతనంనుంచి కాపాడమనీ ప్రార్థించేవాడు. ప్రతిరోజూ, ఆరోజునుంచి ఆమెనుచూసే ప్రయత్నం తాను చేయకూడదనీ, ఆమెను మరిచి పోవాలనీ అనుకునేవాడు. దుర్బుద్ధినించి తప్పించుకునే మార్గం ప్రతిరోజూ వెదకి, ఆమార్గాన్ని ప్రతిరోజూ అవలంబించేవాడు.

అయినా అంతా నిరర్థకమై పోయింది.

ఎప్పుడూ ఏదో వ్యాపకంలో మనస్సును లగ్నం చేయాలని ఒక యత్నం. రెండవది విపరీత శారీరక కృషి, నిరాహారదీక్ష. మూడవది: తన భార్య, అత్తగారు, గ్రామస్థులు—వీళ్ళందరికీ తెలిసిపోవటం వల్ల తన కొచ్చే పరువునష్టాన్ని గురించిన ఆలోచన. ఇన్ని నియమాల్ని, సాధనాల్ని ఎంత విధించుకొన్నా, తనేగెలిచి తీరతానని ఎంతనమ్మకమం కలిగినా, తీరా మధ్యాహ్నం అయ్యేసరికి—వాళ్ళు ఇది వరకు కలుసుకునే మధ్యాహ్నం, ఆమె గడ్డిమోపుతో వస్తూ ఎదురైన మధ్యాహ్నం-అమధ్యాహ్నం వచ్చేసరికి, మరిచి పోయి అడివికి బయలుదేరేవాడు. అయిదు రోజులపాటు అతను పడ్డ బాధది. ఆమెని దూరాన్నుంచే చూసి దెబ్బతిన్న లేడిలా అక్కడే చతికిల బడేవాడు.

* * * * *

లీజా క్రమక్రమంగా కోలుకొంటోంది; కొంచెం ఇటూ అటూ తిరగ గలుగుతోంది కూడా. అయితే ఆమెకున్న ఒకే ఒక్క బాధల్లా తన భర్తలో వచ్చినమార్పు. ఎంత ప్రయత్నించినా దానికి కారణం ఆమెకు అర్థం కాలేదు.

వార్వారా ఊరికెళ్ళింది. మేరీ మామూలుగానే ఉంటోంది. ఇక ఎటొచ్చీ ఆమె ఆరోగ్యాన్ని పరామార్శించేదల్లా ఎజినీ మామయ్య మాత్రమే.

రెండురోజులు వాన కుంభవృష్టిగా కురిసింది. ఆ రెండురోజులూ పౌర్ణమీ అమావాశ్యలే ఎజినీ జీవితానికి. వానవల్ల అన్నిపనులూ ఆగిపొయ్యాయి. ఎరువుల తోలటం కూడా ఆగిపోయింది. రైతులు గుమ్మాలు దాటటంలేదు. పైలకాపులు పశువుల్ని బైటకుతోలినా వెంటనే తీసుకొచ్చేస్తున్నారు. కాస్సేపు మైదానాల్లో ఇటూ అటూ తిరికి తోకలెత్తి రంకెలేస్తూ ఆవులు ఇంటికి వచ్చేస్తున్నాయి.

పరుగులెడుతున్న ఆవులకోసం రైతుస్త్రీలు తలకు తువ్వాళ్ళు చుట్టుకొని నీటివాలును కాళ్ళతో చిమ్ముకొంటూ, నానాఅవస్థా పడుతున్నారు. నీళ్ళు మోకాళ్ళ లోతున రోడ్లమీంచి ప్రవహిస్తున్నాయి; ఆకులూ, గడ్డిపరకలూ నీళ్ళతో నిండిపోయాయి.

ఎజినీ ఇంట్లో తన భార్యదగ్గర కూర్చున్నాడు. అతనిమనస్సు ఆవేళ మనస్సులో లేదు. అతని అసంతృప్తికి కారణ మేమిటా అని ఆమె ఐందసార్లకు పైగా అడిగింది. ఎన్నిసార్లడిగినా యేమీ లేదనేవాడు. అతన్ని అడగటం మానింది కాని ఆమె బాధ మాత్రం మానలేదు.

కాఫీలయ్యాక నడవలో కూర్చున్నారు, మామయ్య తన బట్టల మడతల్ని సరిజేసు కొంటున్నాడు. లీజా జాకెట్టు కుట్టుకుంటూ నిట్టూర్చి, చుట్టూ వాతావరణం బాగాలేదనీ, వెన్నుపూసలో నొప్పివస్తోందనీ అంది. మామయ్య మాటాడకుండా పడుకోమనీ తనకి వోడ్కా తెప్పించమనీ సలహా ఇచ్చాడు. ఎజినీకి ఈ లోకంతో ఏమీ సంబంధంలేదు. స్తబ్ధులా కూర్చున్నాడు. అతనిచుట్టూ అంతా స్తబ్ధుగా నీరసంగా కనిపిస్తోంది. ఒక పుస్తకం తీశాడు; ఒకపత్రికతీశాడు; చదివాడు; ఏమీ అర్థంకాలేదు;

"వెళ్ళాలి. మిల్లులో పనుంది," అన్నాడు. అంటూ లేచి వెళ్ళి పోయాడు.

"కూడా గొడుగు తీసికెళ్ళండి."

"అఖ్ఖర్లేదు. ఇక్కడికేకదా."

జోళ్ళు, తోలుకోటూ తొడుక్కొని ఫ్యాక్టరీకి వెళ్ళిపోయాడు. ఇరువై అడుగులన్నా వేశాడోలేదో ఆమె తటస్థపడ్డది. తలచుట్టూ తువ్వాలు చుట్టుకొని, చీరచెరగులు ఎత్తిపట్టుకొని తన వైపేవస్తోంది.

"ఎక్కడికి వెడుతున్నావ్?" ఆమెని సరిగా గుర్తుపట్టకుండానే అనేశాడు. ఆమెను గుర్తు పట్టేసరికి, ఇంకేముంది? జరగవలసిందేదో జరిగిపోయింది. ఆమె ఆగి, నవ్వింది; అలాగే అతని కళ్ళల్లోకి గుచ్చి గుచ్చి చూసింది.

"మా దూడకోసం వెతుకుతున్నాను. ఇలాంటి గాలిలో మీరెక్కడికి బయలుదేరారు?" ప్రతిరోజూ అతన్ని చూస్తున్నట్టే మాట్లాడింది.

"ముందు షెడ్డులోకిరా" ఎందుకు చెప్పాడో, ఎలాచెప్పాడో తెలియకుండానే ఆ మాట అనేశాడు. ఎవరోఅన్నట్టు, అతను కానట్టు, అనేశాడు.

ఆమె తువ్వాలు నోటకరుచుకొని, కన్ను మిటకరించి ఆ తోటలోని షెడ్డు వైపు పరిగెట్టింది. నాలుగడుగులు ముందుకువేసి ఆ మందార గుబురు చాటునుంచి తానుకూడా షెడ్డులోకి వెళ్ళాలని ముందుకు చురుకుగా అడుగులు వేస్తున్నాడు.

"అయ్యగారూ" వెనకాలనించి కంఠం "మిమ్మల్ని అమ్మగారు రమ్మంటున్నారు."

బంట్రోతు పరుగెత్తుకొచ్చాడు.

"వీడు నన్ను రక్షించటం ఇది రెండవసారి" అనుకున్నాడు ఎజినీ. వెంటనే వెనక్కి తిరిగాడు. ఎవరికో జబ్బు మనిషికి మధ్యాహ్నం మందిస్తానని ఎజినీ చెప్పిన మాట జ్ఞాపకంచేసి, ఆమందు తీసికెళ్ళమని లీజా చెప్పింది.

ఆ మందుకోసం అయిదు నిమిషాలు ఆగవలసి వచ్చింది. ఆతరవాత మందు తీసుకొని వెడుతూ సూటిగా షెడ్డులోకి వెళ్ళటానికి భయపడ్డాడు. తాను అక్కడికి వెళ్ళటం ఇంట్లోంచి యెవరన్నా చూడచ్చు. కాని బాగా దూరంవెళ్ళి, యెవరూ చూడకుండా తిన్నగా షెడ్డుకు తిరిగి వచ్చాడు, ఆ షెడ్డులో ఆవిడ నవ్వుతూ కూర్చున్నట్టు ఊహలో చూస్తూనే ఉన్నాడు. కాని ఆవిడ షెడ్డులో లేదు. కనీసం ఆవిడ ఆషెడ్డులో ప్రవేశించినట్లయినా ఏ ఒక్కచిహ్నంకూడా కనిపించలేదు.

అసలు ఆవిడ రాలేదనీ, వచ్చినా అతనిమాటలు వినివుండదనీ, విన్నా ఆమెకు అర్థమైఉండదనీ—ఆమె వింటుందేమో అన్న భయంకొద్దీ నోట్లోనే అనుకునిఉంటానని—లేక బహుశా ఆమెకి రావాలని లేదేమోననీ అనుకున్నాడు. 'ఆవిడ నాముందు ఒరిగి ఒళ్ళోపడుతుందని ఎందుకనుకోవాలి? దానికీ మొగుడున్నాడు. నాకు భార్య ఉండీకూడా — అందులోనూ అందగత్తె అయిఉండీ—పరస్త్రీకోసం ఉబలాటపడేతుంటర్ని నేను కానీ?' ఆ షెడ్డులో కూర్చుని అలాగే ఆలోచించుకొంటున్నాడు. పైతాటాకుకు ఒక చిన్నకన్నంఉండి నీరు చుక్కచుక్కగా పడుతోంది. 'యీ వానలో ఇక్కడ—ఆదే వచ్చివున్నట్టయితే ఎంత హాయిగా ఉండునో. ఒక్కసారి తరవాత ఏంజరుగనీ, ఆమెను కావలించుకోగలిగితే. ఇంతకీ అది ఇక్కడికొచ్చిందో లేదో అడుగులు వెతికితే తెలుస్తుంది' అనుకున్నాడు. షెడ్డుముందు, షెడ్డులో, తడిగడ్డిమీద కలయవెదికాడు. 'రావటం వచ్చింది. ఇంక ఫరవాలేదు. అది ఎక్కడ కనిపించినా చటుక్కున నిర్భయంగా చెయ్యి పట్టుకోవచ్చు. అర్ధరాత్రి ఇంటికి వెడితేనేనయం.' చాలాసేపు ఆ పాకలోనే కూర్చుని, అలిసి, నిరాశతో వెళ్లిపోయాడు. మందు ఇచ్చేసి, ఇంటికొచ్చి, భోజనంకోసం ఎదురుచూస్తూ మంచంమీద సాగిలపడ్డాడు.

* * * * *

భోజనాలముందు లీజా వచ్చింది. అతని అసంతృప్తికి కారణ మేమిటా అని ఆమె ఇంకా బాధపడుతూనే ఉంది. పురిటికి మాస్కో వెడతానంటే అతనికి ఇష్టం ఉండదేమోనని ఏమైనా ఆ ఊళ్ళోనే పురుడు పోసుకోవటానికి నిశ్చయించుకున్నానని చెప్పింది. పురిటిని గురించీ, బిడ్డని గురించీ ఆమె భయపడుతోందని అతనికి తెలుసు. అయినా అతనికోసం ఆమె అన్నిటినీ యెలా త్యాగంచేస్తోందో అతను గ్రహించాడు. ఆ త్యాగాన్ని తట్టుకోలేక బాధపడ్డాడు. ఇల్లు కడిగినముత్యంలా ఉంది. కాని అతని ఆత్మక్షేత్రం మురికితో, రొంపితో, యెంతో దుర్భరంగావుంది.

ఆరోజల్లా తనకి యెంత ఇష్టంలేకపోయినా, తను యెంత తిరస్కరించినా, రేపు కాలుజారి పోతానేమోనని అతను భయపడ్డాడు.

'ఇలా అయితే లాభంలేదు,' గదిలో ఇటూఅటూ తిరుగుతూ అనుకున్నాడు. 'దీనికేదో పరిష్కార మార్గంచూడాలి. ఏం చెయ్యాలి ?''

ఎవరో రలుపుతట్టారు. బహుశా మామయ్యే అయివుంటాడు. "లోపలి కిరా'' అన్నాడు.

లీజానుంచి, తనకు తనే నియమించుకొన్న రాయబారిగా, మామయ్య వచ్చాడు.

"నీకు తెలుసునో లేదో—నీలో ఈ మధ్య చాలా మార్పు చూస్తున్నాను,'' అన్నాడు,—"లీజాకి—పాపం, ఆమె ఎంతబాధ పడుతోందో దీనికి ! నువ్వు ఈ వ్యవహారాల చిక్కుల్లోపడి చాలానలిగిపోతున్నావు. నిజానికి నిర్వాకమే చేస్తున్నా వనుకో, అయినా నీకు సుఖంలేక పోయిన తర్వాత దేనికిదంతా ? నాలుగు రోజుల పాటు మీరిద్దరూ ఏ క్రిమియాయో పోయి విశ్రాంతి తీసుకోండి. అక్కడ వాతా వరణమూ చాలా బావుంటుంది. మళ్ళీ పంటలు దగ్గర కొచ్చేసరికి వచ్చేద్దురుగాని.''

"మామయ్యా,'' ఎజినీ అప్పాత్తుగా ప్రారంభించాడు. "ఒక రహస్యం దాచగలవా ? నన్ను బాగా బాధిస్తోంది, నాకు చాలా సిగ్గుగా వుండికూడా.''

"చెప్పరాబాబూ—నాదగ్గిర నీకు సందేహమెందుకు?''

"మామయ్యా, నువ్వు నాకు సాయంచెయ్యగలవ్. సాయమే కాదు; నన్ను రక్షించగలవ్ కూడా.'' అన్నాడు ఎజినీ. తన రహస్యాన్ని తన మామముందు వెలి బుచ్చటమనే ఆలోచన— అందులోనూ తనకు ఈషత్తు గౌరవంలేని మామయ్య ముందు— అతనిముందు తనని తేలిక చేస్తుందనీ, తన గౌరవాన్ని గాంభీర్యాన్ని కుంచెపరుస్తుందనే ఆలోచన వచ్చి అతనికి ఆనందం కలిగించింది. తానొక నేరస్థుణ్ణనీ తానొక పాపాత్ముణ్ణనీ అనుకుని తన్ను తాను శిక్షించుకోవాలను కున్నాడు. ఆశిక్ష ఈవిధంగా!

"అదేమిటో చెప్పరా నాయనా. నువ్వంటే నాకెంత ప్రాణమో నీకు తెలి యదు గనకనా.'' ఏదో ఒక రహస్యం ఉందనీ, అది సిగ్గుపడ వలసిన రహస్యం కూడా అనీ, అది తనకు మాత్రమే చెప్పబడుతోందనీ, తను ఆ విషయంలో ఒక సలహాదారు కాబోతున్నాడనీ, మామయ్య తృప్తి పడ్డాడు.

"అన్నిటికన్నా ముందు నేనొక శుంఠననీ, ఎందుకూ కొరగానివాణ్ణనీ, వెర్రి వెధవనీ—నిజంగా వెధవనీ చెప్పుకోవాలి.''

"ఏమిట్రా నోటికొచ్చినట్లల్లా అనుకుంటావ్ ?'' అదేదో తనన్నే తిట్టినట్టు మామయ్య కోప్పడ్డాడు.

"అంతేలే. లేకపోతే, నేను, లీజాభర్తనైఉండి...! ఓహ్, ఆమె పవిత్రతనీ, ఆమె ప్రేమనీ—నేను, ఆమె భర్తను, అవిశ్వాసపాత్రుడుగా తయారయి, ఒక పల్లె పడుచును కోరి..."

"ఏమిట్రా, అది? నీకేం కావాలి? — నువ్వెప్పుడూ ఆమెకి అన్యాయం చెయ్యలేదే!"

"ఇంచు మించు చేసినట్టేకదా. ఏమో ఏమైనా అది నా చేతుల్లోలేదు. నేను అన్యాయంచేయటానికే సిద్ధంగా ఉన్నాను. వీల్లేకపోయింది కాని, జరగవలసిందే. ఇంక తప్పదు. ఏమిచేసిఉండేవాణ్ణో నాకు తెలియదు."

"నీకు పుణ్యంవుంటుంది; నాకు కాస్త విడమర్చిచెపుదూ."

"అయితే విను. నాకు పెళ్ళికాకపూర్వం యీ వూళ్ళోనే ఒకదానితో సంబంధం పెట్టుకున్నాను. అంటే అడివిలోనో, చేలల్లోనో దాన్ని కలుసుకునే వాణ్ణన్న మాట."

"ఓరే, ఆమె అందంగా వుంటుందా?"

ఈ ప్రశ్నకి ఎజినీ ముఖం చిట్లించాడు. అయినా ఇతరుల సానుభూతి అర్థిస్తున్నాడు కనుక విననట్టే నటించి, మళ్ళీ ఉపక్రమించాడు

"ఏదో తాత్కాలికమే అనుకుని, ఆ తరువాత తెగతెంపులు చేసుకోవచ్చునని మరచిపోవచ్చునని అనుకున్నాను. నా పెళ్ళికాక పూర్వమే తెగతెంపులు చేసుకొన్నానుకూడా. ఒక సంవత్సరంపాటు ఆమెను చూడనూలేదు; ఆమె ఆలోచన కూడా రాలేదు." తన పరిస్థితి తన నోటిమీదే వినటం ఎజినీకి చిత్రంగావుంది. "ఆ తరవాత అకస్మాత్తుగా, యెందుకో నాకే తెలియదు—బహుశా మందు పెట్టడమంటే ఇదేనేమో—ఆవిణ్ణి చూశాక నా గుండెల్లో ఏదో పురుగు ప్రవేశించింది. అది ఊరికే తొలిచివేస్తోంది. నన్ను నేనే తిట్టుకుంటాను; నేను పొరపాటు పడతానేమోనని భయం; అంటే కాళ్ళు జారతానేమోనని. దేవుడి దయవల్ల యింతవరకూ అలాంటి పనిచేయలేదు కాని—ఇంతెందుకు, నిన్న నేను దానికోసం బయలుదేరాను, తీరా లీజా కబురంపిందిగాని."

"ఏమిటి, వానలోనే?"

"అవును. ఇంక నేను భరించలేను మామయ్యా; నీతో చెప్పుకొని, నీసహాయం తీసుకొంటే కొంత నయమని—"

"అవుననుకో, అయినా నీ స్వంత ఊళ్ళో ఇలాంటిపని మంచిదికాదు. అందర్లోనూ అల్లరై పోతుంది. లీజా చాలా నీరసంగా ఉందనీ, ఆవిణ్ణి అలా విడిచిపెట్టటం మంచిదనీ నేనూ అనుకుంటాను; కాని, ఉన్న ఊళ్ళోనా?"

మామయ్య మాటలు వినకూడదని ఎజినీ మళ్ళీ ప్రయత్నించాడు. వినలేక, మళ్లీ మాటల్లో పెట్టాలని:

"అవును. ఎల్లాగో కాపాడాలి నువ్వే. అదే నిన్ను కోరుతున్నది. ఇవాళ అదృష్ట వశాత్తూ తప్పిపోయాననుకో. కాని రేపో; ఎల్లుండో — అప్పుడెవరు తప్పిస్తారు! ఈ సారి దానికి కూడా తెలిసింది నన్ను ఒక్కణ్ణీ వదిలిపెట్టకు."

"సరేలే," అన్నాడు మామయ్య. "కాని, అబ్బాయి, దాన్ని అంత ఇదిగా ప్రేమిస్తున్నావట్రా?"

"అదేం కాదు మామయ్యా! అదేం కాదు. ఏదో శక్తి నన్ను పట్టుకు పీడిస్తోంది. నాకేమి చెయ్యాలో తోచటం లేదు. బహుశా నాకు బలం వచ్చి, ఆ తర్వాత ..."

"దీనికొక మందుంది చెప్తావిను. అంతా దానికదే చల్లబడుతుంది." అన్నాడు మామయ్య. "మనం క్రిమియాకి పోదాం."

"సరే, అలాగే పోదాం అయితే. ఈలోగా అస్తమానూ నాతో కూడా ఉండు."

*   *   *   *   *

తన రహస్యాన్నీ, దానితో బాటు తన అంతరాత్మ పడుతున్న మథనని, ఆ వాన రోజున తను అనుభవించిన అవమానాన్నీ తన మామయ్యతో చెప్పుకోవటంవల్ల ఎజినీ కొంత ఊరట చెందాడు. ఒక వారంలో యాల్టా ప్రయాణం కూడా నిశ్చయమయిపోయింది. ఆ వారమల్లా పట్నానికి వెళ్లి డబ్బు సేకరించుకోవటంలోనూ, అవసరమైన సూచనల్ని మేనేజర్‌కి చెప్పటంలోనూ గడిచిపోయింది. మళ్ళీ ఉత్సాహాన్ని కోల్పోకుండా యథాప్రకారం భార్యదగ్గర హుషారుగా ఉంటున్నాడు. అంటే నైతికంగా కొంత కోలుకున్నాడన్న మాట.

ఆ వానకురిసిన రోజు తరవాత మళ్ళీ స్టెపానిడాని చూడకుండానే తన భార్యా సమేతంగా క్రిమియా వెళ్ళిపోయాడు. రెండు నెలలపాటు అక్కడ నిశ్చింతగా గడిపివేశాడు. ఆ కొత్త సంతోషంలో గతమంతా చెరిగిపోయినట్టే అనిపించింది ఎజినీకి. క్రిమియా పూర్వస్నేహితులంతా కనిపించారు. వాళ్ళు కూడా మరింత సన్నిహితులయ్యారు. క్రొత్త స్నేహాలు కూడా ఏర్పడ్డాయి. క్రిమియాలో జీవితం ఎజినీకి ఒక పెద్ద సెలవురోజులా గడిచిపోయింది. గొప్ప గొప్ప వాళ్ళ స్నేహాలు కూడా దొరికాయి.

ఆగస్టు ఆఖరువారంలో లీజా ప్రసవించి అందమైన ఆరోగ్యమైన ఆడబిడ్డను కంది. ఆవిడ పురుడు కూడా అనుకోకుండానే తేలిగ్గా గడిచిపోయింది.

సెప్టెంబర్‌లో వాళ్ళు నల్గురూ ఇంటికొచ్చేశారు. లీజా, బేబీ, బేబీతో పాల తల్లి కూడా వచ్చింది. లీజాదగ్గర పాలు లేకపోవటమే కారణం. పాత బాధలన్నింటినీ మరిచి, క్రొత్త ఆనందంతో హాయిగా ఇంటికొచ్చాడు ఎజినీ. ఆ అవస్థలన్నీ పడి — బిడ్డను కనేటప్పుడు భార్యపడే వేదనంతా భర్త కూడా పడతాడు కదా — బిడ్డనెత్తు

కొన్నాక ఆమెను మరింత గాఢంగా ప్రేమించసాగాడు. పాపాయిని చేతిలోకి తీసుకున్నప్పుడు అతనిలో ఒక చిత్రమైన, సరిక్రొత్త, ఆనందదాయకమైన గిలిగింత లాంటి తమాషా అనుభూతి కలిగేది. క్రిమియాలో తాను కలుసుకున్న గొప్ప నాయకుడి ప్రోద్బలంవల్ల రేపు రాబోయ్యే అసెంబ్లీ ఎన్నికల్లో పాల్గొనాలనే క్రొత్త ఉత్సాహంకూడా అతన్ని ఆక్రమించింది. అది కొంతపని పుచ్చుకొనేది.

అతన్ని ఊరించిన సంగతి పెట్టేబాధ, అతను ఇదివరకు పడ్డ మధన అతి కష్టం మీద కాని జ్ఞాపకాని కొచ్చేవి కావు. అదోరకం పిచ్చిలో పడిపోయి బాధపడ్డానని అనుకునేవాడు.

అతని ఆత్మ పూర్తిగా విముక్తి పొందింది. అతని కామె సంగతిని గురించి మేస్త్రీని అడగటానికికూడా భయంగాలేదీసారి. ఇదివరకులా సిగ్గుకూడా వెయ్యలేదు.

"ఏమోయ్, దాని మొగుడు ఇంకా మాస్కోలోనే ఉన్నాడా?" అడిగాడు మేస్త్రీని.

"చిత్తం"

"వాడి పెళ్ళామో?"

"పోనిస్తురూ దొంగముండ. అది ఇప్పుడు గుమాస్తాని తగులుకొంది. బజారు ముండ."

"పోనీలే, పీడాపాయిరి" అనుకున్నాడు ఎజినీ. 'ఓహో, ఏమిటి నాకీ వైరాగ్యం! ఎంత గొప్పగా మారిపొయ్యాను!'

*           *           *           *           *

ఎజినీ కోరినంతా జరిగింది, ఆస్థి దక్కింది. ఫ్యాక్టరీకూడా చాలా బాగా పనిచేస్తోంది. చెరుకు తోటయినా బాగానే పండింది. ఈ సంవత్సరం భార్యకూడా సంతృప్తికరంగానే బిడ్డని కంది. అత్తగారి పోరు వదిలిపోయింది. యెన్నికల్లో అతను గెలిచాడు.

యెన్నికలయ్యాక బస్తీనుంచి ఇంటికి వస్తున్నాడు. అందరూ అతనికి అభివందనా లిస్తారు. అందరికీ అతను కృతజ్ఞత చెప్పకోవాలి ఇల్లు దగ్గర పడ్డకొద్దీ ఈ యెన్నికల ఫలితంగా తన సామాజిక స్థాయి యెంత పెరిగిందో కొలుచుకో సాగాడు. అతని కల నేటికి ఫలించింది. తన పలుకుబడి అంతా వినియోగించి తన వ్యవసాయానికి కావలసిన హంగులన్నీ ఏర్పాటు చేయించుకోవచ్చు. ఈ మూడేళ్ళలోనూ వచ్చినమార్పుల బట్టి తన రైతులూ, ఇతర రైతులూ తన గురించి ఏమనుకుంటారో ఆలోచించసాగాడు. "ఉదాహరణకి వాళ్లు"—అప్పుడే ఒక ముసలిరైతు, తన పక్కనే ఒక రైతుస్త్రీ—అతనికి తటస్థపడ్డారు. అతని బండి దాటిపోవటం కోసం వాళ్లు పక్కకి తప్పుకొని ఆగిపొయ్యారు. ఇంకేముంది!? స్టెపానిడా, ఆమె మామగారున్నూ. ఎజినీ

ఆమెకేసి చూసి గుర్తుపట్టాడు. తన మనస్సేమీ ఆమెను చూడటం వల్ల చెదరి పోలేదు కదా అని సంతోషించాడు. ఆమె ఇదివరకటి అంత అందంగానూ ఉంది. అయినా అతని మనస్సు చెదరలేదు. తిన్నగా ఇంటి ముందాగాడు.

"ఓహోహో, నాకు చాలా సంతోషంగా ఉంది," అంటూ మామయ్య ఎదురయ్యాడు.

"అవును. ఎన్నికల్లో నేను గెలిచాను."

"అద్భుతం! ఈ సారి తాగాలి నేను."

మర్నాడు చేలోకి వెళ్లాడు. వ్యవసాయం ఎంత వరకూ వచ్చిందో! కొత్త ఇంజనొకటి అక్కడ పని చేస్తోంది. దాన్ని పరిశీలిస్తూ ఆడవాళ్లమధ్యకి వెళ్లాడు; కాని, వాళ్లకేసి చూడడానికి ప్రయత్నించలేదు. ప్రయత్నించక పోయినా స్టైపానిడా కాటుకకళ్లు కనిపించాయి. ఒకటి రెండుసార్లు ఆమెకేసి ఓరగా చూశాడు. అతనిలో ఏదో కదులుతున్నట్టనిపించింది కాని, దాన్ని లక్ష్యం చెయ్యలేదు. ఆ మర్నాడు మళ్ళీ అక్కడికి వెళ్లి ఊరికే వృథాగా రెండుగంటలసేపు అక్కడ కూర్చొని, వీలిచ్చినప్పుడల్లా ఆ కాటుక కళ్లకోసం వెతుక్కొంటూ, ఆఖరికి మళ్ళీ తన పతనం ప్రారంభమయిందనుకున్నాడు. మళ్ళీ పాతబాధలన్నీ అవతరించాయి! పాతభయాలూ పాత బాధలూ—ఈసారి తానింక బైటపడలేదు.

చివరకి అనుకున్నంతా అయింది. ఆ మరునాటి సాయంత్రం తనకు తెలియకుండానే ఆమె దొడ్డిగుమ్మం దగ్గరకెళ్ళి ఆమె గడ్డిగుడిసె వెనక నిలబడ్డాడు. ఇదివరకొకసారి అక్కడే కలుసుకున్నారుకూడా. సిగరెట్టు ముట్టించుకొంటూ అలాగే నిలబడి పోయ్యాడు. పొరుగింటి రైతుభార్యచూసి, అతను వెనక్కి తిరగగానే "పోవే; ఆయన మళ్ళీ నీకోసం తయారయ్యాడు. ఒట్టు; అక్కడ నిలబడ్డాడు. పోవే వెర్రి పీనుగా!" అనటం వినిపించింది.

గడ్డిగుడిసెలోంచి ఒకావిడ—ఆవిడే—పరుగెట్టుకు రావటం చూశాడు. కాని యెవరో రైతు ఆదారినే వస్తూండటంవల్ల వెనక్కి తిరగటం బాగోదని ఇంటికి వెళ్ళిపోయాడు.

* * * * *

ఇంటికి వెళ్ళాడు; అంతే. అంతా మారిపోయింది. అంతా గందరగోళంగా కనిపించింది. ఆ ఉదయమే లేచి తన మనస్సులోంచి ఈ విషయాన్ని పూర్తిగా తరిమి వెయ్యాలనీ, పూర్తిగా మరిచిపోవాలనీ, అసలు ఆలోచించ కూడదనీ బ్రహ్మ ప్రయత్నం చేశాడు. అయినా అది అతనికి సాధ్యంకాలేదు. యేపని చేయటానికీ ఉత్సాహంగాలేదు. ఇదివరకు యెంతో అందంగా యెంతో ఆనందంగా కనిపించిన ప్రతిదీ ఇప్పుడతనికి అంతా వికృతంగా అంతా అసహ్యంగా కనిపిస్తోంది. వ్యాపార

వ్యవహారాలన్నీ ఆశేష కట్టిపెట్టుకోవాలని పించింది. ఇదంతా ఆతను కూర్చుని ఆలోచించుకోవటం కోసం. అన్నీ వాయిదా వేసి ఒక్కడూ కూర్చున్నాడు. తీరా ఒక్కడూ అయ్యాక తోటమ్మటా అడివమ్మటా తిరగటం ప్రారంభించాడు. ఆ స్థలాల వెనుక ఉన్న గాథలన్నీ అతని స్మృతిలోకి వచ్చి అతన్ని సమ్మోహితుణ్ని చేసేవి. తాను తోటలో నడుస్తున్నాననీ ఏవో అతి ముఖ్యమైన సంగతుల్ని ఆలోచించుకొంటున్నాననీ అనుకోనాగాడు. కాని నిజానికిదేమీ కాదు. ఆమెకోసం ఎదురు చూస్తున్నాడంతే. ఎప్పుడో ఏక్షణాన్నో ఇప్పుడే ఈ క్షణాన్నే—ఆవిడ రావచ్చు. ఆమెతో ఏక్షణాన్నో ఎక్కడికో వెళ్ళి పోవచ్చు. ఇక్కడే ఎవరూ చూడకుండా లేక అర్ధరాత్రి చివరికి చందమామ కూడా లేకుండా, కాకులుదూరని కారడవుల్లో చీమలుదూరని చిట్టడవుల్లో—ఆమెవస్తే— చటుక్కున ఆమె వంటిమీద తను చెయ్యివేస్తే...

ఓహో తెంచేసుకోవాలి తెంచేసుకోవాలను కున్నాను. ఆరోగ్యం కాపాడుకోవాలి కనుక స్వచ్ఛమైన ఆరోగ్యవతి చాలనికదూ! దాని దగ్గర ఇలాంటి ఆటలన్నీ సాగుతాయా, నేను దాన్ని గెల్చా ననుకున్నాను. కాదు! అదేనన్ను గెల్చింది. కాదు పట్టుకొంది. పట్టుకొని విడిచిపెట్టటం లేదు. నేను విముక్తి పొందాననే అనుకున్నాగా? నాకు విముక్తేమిటి ? ఆ మాట చెప్పకొని నా పెళ్ళిముందు నన్ను నేను మోసం చేసుకొన్నాను. చెత్తగొడవ. గా! కాని దాన్ని పొందినప్పట్నుంచీ ఒక కొత్త అనుభూతి—ఒక భర్త పొందే అనుభూతి. నిజమే దానితోనే ఉండి పోవలసింది.

'రెండురకాల జీవితాలు. అందులో ఏ ఒకటో నాకు వీలిస్తుంది. లీజా, ఎస్టేటు, పాపాయి, ప్రజాగౌరవం—ఈ జీవితం ఒకటి. అదే జీవితమయితే ఆ జీవితంలోకి స్టెపానిడా అడుగుపెట్టడానికి వీల్లేదు. దాన్ని ఎక్కడికేనా తరిమివెయ్యాలి. లేదా నాశనం చెయ్యాలి; అది బతక్కూడదు. ఇక రెండవ జీవితమూ: దాన్ని భర్తనించి లేవదీసుకొని, వాడికింత మనోవర్తిచ్చి, అవమానాన్నీ సిగ్గునీ అవమానించి, ఛళ్ మోహనరంగా అనటం. ఇదే జీవితాశయం అయితే ఇంక లీజా అడ్డు ఉండకూడదు; బేబీ అడ్డుకూడా. పోనీ బేబీ ఏంచేసింది కనుక—అగి ఫరవాలేదు.—ఒక్క లీజామాత్రం దాని కడ్డురాకూడదు. దానికీసంగతి తెలిసి, తిట్టి, లేచిపోవాలి. నేనొక పల్లెదాన్ని తగులుకున్నాననీ, దాన్ని వొదిలేకాననీ, నేను వరి వెధవననీ, మాదచోద్యదుననీ తెలుసుకొని, లీజా—వీల్లేదు. పోనీ...' ఆ ఆలోచనలకి అడ్డులేక పోయింది. 'పోనీ ఆమెకు జబ్బు యెక్కువై చచ్చిపోతే?' షెభాస్, అద్భుతంగా వుంటుంది.

'అద్భుతమా! ఓరి వెధవా! అద్భుతమట్రా! నో, నో, నో, — యెవరో ఒకరు చావక తప్పని పరిస్థితేవస్తే స్టెపానిడా చావటమే నయం.

"అవునవును. మగాళ్ళు తమప్రియురాళ్ళనో భార్యల్నో చంపుతారంటే అంతే మరి; రివాల్వర్ తీసుకో; వెళ్ళు! పిలు; కావలించుకోవటానికి బదులు 'ఢాం' మ్మని గుండెల్లోంచి దూసుకు పోయేలా కాల్చు.

"నిజమేరా బాబ— అది దయ్యమే. దయ్యమే అది. నాకు తెలియకుండానే నాఇష్టానికి వ్యతిరేకంగానే నన్ను ఆవహించింది.

"చంపటమా? అవును. దానికి రెండే దారులున్నాయి; నా భార్యనో, దాన్నో ఇలా బ్రతికటం మాత్రం కష్టం. అసాధ్యం! నేనే ఆలోచించి ఏదో వెంటనే తేల్చెయ్యాలి. ఇలాగే ఉంటే ఏం జరుగుతుంది? ఫరవాలేదు, అంతా మరిచి పోగలనని అనుకుంటాను. మాటలేగా. మళ్ళీ చీకటి పడేసరికి దాని దొడ్డిగుమ్మంముందు తయారౌతాను. ఆ సంగతి దానికి తెలుస్తుంది. అది నాకోసం తయారౌతుంది. ఈసంగతి నలుగురికీ తెలిస్తే! నేను అబద్ధం చెప్పలేను— అబ్బే ఇది లాభంలేదు. ఇలా బతకలేను. లాభంలేదు. నలుగురికీ తెలిసి పోతుంది. కంసాలికీ మంగలికీ కూడా—అలా బతక గలనా?

'వీల్లేదు రెండే రెండుమార్గాలున్నాయి. నా భార్యనన్నా చంపాలి; లేక దాన్నన్నా. అవును. కాకపోతే...ఓయస్ ఇంకోమార్గంకూడా ఉంది. నన్నేచంపుకుంటే,' చాలా మెత్తగా అనుకున్నాడు. ఒళ్ళంతా ఒక్కసారి జలదరించింది. 'అవును, నన్ను చంపుకొంటే సరి. వాళ్ళని చంపనేఅక్కర్లేదు.' భయంవేసింది. అదొక్కటే దారికనిపిస్తోంది. అతనికో రివాల్వర్ ఉందికూడా. 'నిజంగా నన్ను నేను చంపుకోనా? అరే, ఈ సంగతే ఆలోచించలేదే — చాలా తమాషాగా ఉంటుందికదూ ?..."

తిన్నగా గబగబా గదిలోకి వెళ్ళి రివాల్వర్ పెట్టెతీసి, పైకి తియ్యబోతూంటే భార్య గదిలోకి వచ్చింది.

* * * *

ఒక కాయితం తీసి కప్పెట్టాడు.

"మళ్ళీ అలాగే !" ఆమె నిశ్చేష్టురాలై అంది.

"ఏమిటి అలాగే ?"

"ఇదివరకు మీ ముఖంలో కనిపించిన భయంకరమైన అనుభూతి—మిమ్మల్ని ఎంత అడిగినా మీరు చెప్పని అనుభూతి. జెన్యా, నానీ, నాతో అదేమిటో చెప్పరూ? మీరేదో బాధపడుతున్నారు. నాతో చెప్పండి; మీకు కొంత తేలికౌతుంది. అది ఎలాంటిదైనా ఫరవాలేదు; మీరు మనస్సులో పెట్టుకు బాధపడటం మంచిదికాదు. అదేమీ చెడ్డదికాదని నాకు తెలియదా ?"

"నీకు తెలుసా !..."

"చెప్పండి; అదేదో చెప్పండి. చెప్పకూడని మిమ్మల్ని వెళ్లనివ్వను."

గుండె కరిగిపొయ్యేలా నవ్వాడు.

'చెప్పేయనా ?—వద్దు. లాభంలేదు. అయినా [illegible]

చెప్పేవాడే. కానీ సమయానికి పాలతల్లివచ్చి బిడ్డని అలా పైకితీసికెడతానని చెప్పింది. అందుకని గానుతో వగాలని లీజా లోపలికెళ్లింది.

"చెప్పదుకుగాని. ఒక్క నిమిషంలో వస్తాను. మీరు చెప్పక తప్పదు."

"అలాగే, దానికేం..."

అతనలా అంటూ నవ్విన నవ్వు ఆమె యెన్నటికీ మరిచిపోలేదు.

గబగబా, తొందరగా, దొంగలా రివాల్వర్ పైకి తీశాడు. రివాల్వర్ లోడ్ లోనే వుంది.

'సరే యెలాగ?' దాన్ని నుదుటికి ఆనించి ఒక్కక్షణం సందేహించాడు. వెంటనే స్టెఫానిడా జ్ఞాపకం వచ్చింది—ఆమెను చూడకూడదనే అతని నిర్ణయం. అతని సంఘర్షణ, అతని ఆశ, పతనం, మళ్ళీ సంఘర్షణ—భయంతో వణికిపోయాడు. 'ఛీ—ఇదే నయం,' ట్రిగ్గర్‌ని నొక్కాడు.

లీజా గదిలోకి పరిగెత్తేసరికి—అతను నేలమీద బోర్లా పడున్నాడు; నల్లని, వెచ్చని రక్తం గాయంలోంచి స్రవిస్తోంది.

విచారణకూడా జరిగింది. యెవరూ అలాంటి ఆత్మహత్య యెందుకు జరిగిందో చెప్పలేక పోయారు. ఎజినీ తనతో చెప్పిన సంఘటనకీ దీనికీ సంబంధం వుందనికూడా మామయ్య అనుకోలేదు.

వార్వారా తను ఇదివరకే ఇలాంటిదేదో జరిగితీరుతుందని అనుకుంటున్నాననే చెప్పింది. అతను పేచీపద్ధతి చూస్తేనే ఆమెకలా అనిపించిందట. లీజాగాని, మేరీగాని ఇలా యెందుకు జరిగిందో ఊహించలేక పోయారు. దాన్ని వాళ్లు నమ్మలేక పోయారు. వాళ్లెరిగిన అందరికంటేనూ అతను బుద్ధిమంతుడని వాళ్ళ నమ్మకం.

ఒకవేళ ఎజినీగాని మానసిక దుర్భ్రమలో పడివుంటే అందరూకూడా ఇంచుమించు అంతేకదా: నిజంగా పిచ్చెత్తినవాళ్లు యెవరంటే, తమలో పిచ్చి వుందని తెలియకుండా, ఇతరుల్లో పిచ్చితనం చూసేవాళ్లే!

ఐపోయింది

# కళాకేళి ప్రచురణలు

## శామల్ కోట

| | | |
|---|---|---|
| బానిసల దేశం | (సోమసుందర్) | 1–0–0 |
| త్వమేవాహం | (ఆరుద్ర) | 1–0–0 |
| మందీమనిషి | (సోమసుందర్) | 1–0–0 |
| శిథిలాలయం | (చిన్నా) | 1–0–0 |
| కుళ్ళుసరుకు | (చిన్నా) | 1–0–0 |
| అనామకులు | (జోగిరాజు) | 1–0–0 |
| లక్ష్మింపతిగారి అమ్మాయిలు | (రాంషా) | 1–0–0 |
| సంజదీపం | (పూభా) | 1–0–0 |
| మనస్తత్వాలు | (రాంషా) | 1–0–0 |
| దయ్యంపట్టిన మనిషి | ,, | 0–12–0 |
| అప్పగింత | (ఈరంకి) | 1–8–0 |

పుస్తకాలకు

కళాకేళీ, శామల్ కోట.